బూని సన్మార్గవృత్తిమై ♦ బొల్చె పొలపు
దులకు తనచాయ పొలతుక ♦ తోడఁ గూడి. 150

## హేమంత వర్ణన

వ. తదనంతరంబ, 151

చ. జలముల నెల్లఁ గ్రుంగ హిమ ♦ శైల సమావృతశీత వాతముల్
నలుదెసల న్మెలంగ నన ♦ లంబు జనంబుల కాంత భంగి మై
చెలు వలరంగ దిక్పటల ♦ సీమల హైమము బాటిలంగ వృ
ద్ధులు బలుబెంగ బ్రుంగతరితో చలికాల మిలం జెలంగఁగన్. 152

గీ. తొలి మలదవ్రొమ్మ నెడలించి ♦ చలికి నులికి
కడలి చలిమిరి కడలి బకల్వడిని నార్వ
ములు బరచ దాని వలన న ♦ మోఘ గతిని
యహము లల్పంబు లయ్యె న ♦ య్యవసరమున. 153

వ. అట్టి హేమంత కాలంబున నయ్యనంతా కాంతుండు కంఠాక్రాంత
జలాంతరంబున నత్యంత తపంబు సేయుచుండ. 154

## గ్రీష్మర్తు వర్ణనము

గీ. కనలి బలుగాలితోఁ గూడి ♦ వనములను హా
రింపు జనులకుఁ జూచుట ♦ కింపుఁగాక
భూతభీతిగ దావాగ్ని ♦ పోలి వెలిఁగి
భీష్మమై భూమిపొడచూపె ♦ గ్రీష్మ ఋతువు. 155

వ. అట్టిసమయంబున 156

చ. బెడిదఁపు వెట్ట నీరువుర ♦ వింటికి మొగ్గలు త్రొ[illegible] త్రుళ్లకా
ళ్లడరఁగ పత్రపత్రములు ♦ నైదనరంజనె పక్షి [illegible]
ర్పడ నలహంసతో జతత ♦ వాపెడి తత్కరణ[illegible] వృత్తి దా
నుడువఁగ నేగు సారసము ♦ లోయన సారసముల్ సరస్సులన్. 157

ఉ. బిట్టుగువెట్ట నీరివుర ♦ బెద్దతటాకములంపు రేవులన్
దొట్టుపదైకతన్ నిలిచి ♦ దొ్రటుచటించుక విప్పు టెక్కలన్
గట్టెరఁదోప నేపుగ బ ♦ కంబులు బోల్చెను కావిధోవతుల్
పట్టుగదాల్చి వారుణ జ ♦ పంబులు జేసెడి విప్రులో యనన్. 158

మ. ఖరమృష్టిస్ఫుట తిగ్మభానులను దీ ♦ తుంభావి బీజార్థమా
స్థిరతిన్ దిష్ట కృషీవలుం డఖిల ధా ♦ త్రీజాతముల్ బంక్ల నూ
ర్చరహిం గాలికిఁబట్టెనో యనఁగ బో ♦ ల్చెన్ భగ్నపర్యాప్త ప
త్రరజః కాండ మఖండచండ తమరు ♦ చ్చాతుర్య తిర్యగ్గతిన్. 159

మ. కొనె నెవ్వేళ భజించు యబ్ధిజను లో ♦ కుల్మెచ్చ నీలానురూ
ప నితాంత ప్రియభూతినొంది విరహా ♦ ప్రాప్తైకసంతప్తగా
దనుఁ జేసెన్ హరియంచు భూరమణి చి ♦ త్తంబందు నిట్టూర్పులో
యన వేగాడ్పుల నుబ్బ నుబ్బతిలెను ♦ ద్యద్భీకరంబై ధరన్. 160

మ. మును రాజొక్కఁడు వెన్కనన్ గడనగం ♦ బుం జేరి దత్సౌమ్య శా
సనముల్ గాకొనరింపఁబూని నిజతే ♦ జప్రాపులం బంపన
య్యూన సంబంధులు దన్మహోవిధుల నెం ♦ దేదుగ్రముల్ గొంచు బో
ల్చిన లీలందగె రేల దావశిఖ ల ♦ ద్రిశ్రేణి నుద్దీప్తమై. 161

వ. ఇట్లు గ్దండంబైన యెండకాలంబున నయ్యిలా మండలాఖండలుం డఖండ నిష్ఠాగరిష్ఠత్వంబు హృదయ పుండరీకంబున నొండుకొన నల్గడల చండాగ్నుల నిండుకొని, మార్తాండ లోకనంబు సేయుచు యస్తోకతపంబు జేయుచున్న యవసరంబున- 162

### జనకునకు శంభుఁడు ప్రత్యక్ష మగుట

సీ. ఫణిఫణాయత లస ♦ ద్మణిమణియుత భూష
ణాళితో నతభక్త ♦ పాళితోడ
నవసతస్మేరధా ♦ మాంచితానన వామ
భామతో సంభృత ♦ ప్రేమతోడ
నురు సువర్ణ విచిత్ర ♦ తరశుభానంత చే
లమ్ముతో వహాని ♦ జాలమ్ముతోడ

లోకపాలన ఘృణా ♦ లోకాక్షి చాకచ
క్యములతో మధురవా ♦ క్యములతోఁ

గీ. సతుల శోభావిఘాతి రా ♦ మా కృతీంద్ర
ఈ వధూ కచభూషణ ♦ కృత దశాస్య
గర్వ భేదాతిశయ పదా ♦ గ్రమహిమాప్తి
నలరు పరమేశ్వరుండు ప్ర ♦ త్యక్ష మయ్యె. 163

గీ. ఇట్లు సాక్షాత్కరించి దా ♦ నెలమిఁ నంది
వాహనారూఢుఁడైన య ♦ వ్వామదేవు
గాంచి యానంద పూర మ ♦ త్కటము గాఁగ
హృదయ కాసారమున బొంగ ♦ ముద మొసంగ. 164

గీ. తపము చాలించి లేచి భూ ♦ ధవుఁడు తనదు
తరుణితో గూడ సాష్టాంగ ♦ దండ మొఱఁగి
లేచి కరపాళి తలను గీ ♦ లించి పల్కె
త్రిభువనాధారు నా దేవ ♦ దేవు నభవు.

శివరామాత్మక కల్పిత కల్పవల్లి సీసము

సీ. దీనమందార వ ♦ ర్ధిత భూతవారగా
నానుమోదాత్మ గం ♦ గామలాత్మ
దాక్షాయణీశ సం ♦ స్తవ నిర్జరేశ ర
క్షాధిపధ్వంస రా ♦ జావతంస
సాకల్య పుణ్య శా ♦ శ్వతకీర్తిగణ్య లో
కేశ్వర స్తోత్ర లో ♦ కైక పాత్ర
కోట్యర్క తేజ స ♦ ద్గుణవందితాజనా
త్యాది సంతోష నా ♦ గాదిపోష

గీ. భావనోద్దీప నిర్భర ♦ భవ్యరూప
భావనాతీత చిత్పర ♦ భక్తజాత
సర్వ దుర్మార్గభంజన ♦ సాధుసర్గ
గర్వ యుక్తిస్తుతశంకర ♦ కంబువీక్ష.

వ. అని మఱియు నిట్లనియె. 167

సీ. హరి ముఖ్య పాలితో ♦ త్తరదిశా వాసాయ
వాసవాద్యమరాళి ♦ వందితాయ
కైలాస భూధర ♦ కంధర గేహాయ
వర్ణిత వృషభేంద్ర ♦ వాహనాయ
స్వర ధిపద్విచ్ఛి దే ♦ శాంతాయ దాంతాయ
శేషాహిరాజ వి ♦ భూషణాయ
దారిద్ర్యదోష వి ♦ స్తార విదూరాయ
సమ్యగ్దయారస ♦ సాగరాయ

గీ. పరమభక్త మనోంబుజ ♦ భాస్కరాయ
దీపితామల భూతి వి ♦ లేపనాయ
శ్రీమనోనాయకార్చితాం ♦ ఘ్రిద్వయాయ
మహదభినుతాయ భవతే న ♦ మశ్శివాయ. 168

సీ. ఫాలలోచన భక్త ♦ పాలక నారద
గానలోల కృపాని ♦ ధే నమోస్తు
సకల లోకైక ర ♦ క్షక పార్వతీనాథ
శ్రీనాయకార్చిత ♦ తేనమోస్తు
చంద్రావతంస దే ♦ వేంద్రముఖామరా
ధీశ్వర భూతేశ ♦ తే నమోస్తు
కైలాసవాస శం ♦ కర పుంగవ తురంగ
దీనావనాధ్యక్ష ♦ తేనమోస్తు

గీ. అనుచుఁ బ్రణుతింతు నీదు పా ♦ దాంబుజముల
కసుర వరభంగ మానిప్ర ♦ దాబ్జ భృంగ
మథిత మాతంగ లింగ వా ♦ రిధి నిషంగ
మేరు చాపశుభాంగ భూ ♦ మీశతాంగ. 169

సీ. దండంబు కోటి మా ♦ ర్తాండ సన్నిభ తేజ
దండంబు దీనమం ♦ దారభూజ

దండంబు ఘన శర ♦ త్పుండరీక శుభాంగ
దండంబు ధృతకరాం ♦ తర కురంగ
దండంబు ఘోరవే ♦ దండ దానవ భేద
దండంబు గాన వి ♦ ద్యా వినోద
దండంబు పార్వతీ ♦ దానవ్రోత్సవ లోల
దండంబు వాయుప ♦ ద్యానుకూల
గీ. దండ మనలాక్ష రూక్ష కం ♦ దర్పశిక్ష
దండ మాభూషణితశేష ♦ దళితదోష
దండ మగధామసోమ భృ ♦ [illegible]త్రసీమ
దండ మకలంక శంకరో ♦ త్తమ వృషాంక. 170

వ. అని బహుప్రకారంబుల నభివందనంబు లాచరించి మఱియు నిట్లనియెను. 171

సీ. శ్రీమద్గుణాధార ♦ శ్రితజనమందార
అహిరాజ కేయూర ♦ యఘవిదూర
ఖండచంద్రకిరీట ♦ గంగాజటాజూట
పీతఘోరనిశాట ♦ వృషభఘోట
శరదభ్రనిభకాయ ♦ సురరక్షణోపాయ
యగజాసహాయ మ ♦ హర్షిగేయ
కరభృత్కపాలలో ♦ క స్తుత్య వరశీల
కరుణాలవాల భ ♦ క్తజనపాల
గీ. మాధవనుతాంగ దోషత ♦ మః పతంగ
యమమదవిభంగ మాని హృ ♦ దాబ్జభృంగ
మథితమాతంగ లింగవా ♦ రిధి నిషంగ
మేరుచాపశుభాంగ భూ ♦ మీశతాంగ. 172

సీ. విశ్వంభరంబు స ♦ ప్తాశ్వచంద్రులు న
భంబును కనకాచ ♦ లంబు శేష
పన్నగేంద్రుండును ♦ పద్మాసనుఁడు వార్ధి
ధానఁబు నిందిరా ♦ ధవుఁడు శ్రుతులు

స్యందనంబును రథ ♦ చక్రంబు లాతప
త్రంబును బా ♦ ణాసనంబు మార్వి
సారథి శరధియు ♦ సాయకంబును తురం
గంబులుగాక వి ♦ క్రమము మిగిలి

గీ. త్రిపురములుగెల్చి కృపజగ ♦ త్రికముఁగాచి
నట్టి వీరావతారుని ♦ న్నభినుతించి
కేలుమోడ్చెద సకలది ♦ గ్గాల చేల
పాలితామరజాల కృ ♦ పాలవాల. 173

సీ. గతజన్మ సంప్రాప్త ♦ కలుష సంఘుంబులు
నేఁటితోఁజనె మాకు ♦ నీలకంఠ
పరమశోభన పరం ♦ పర సమగ్రంబుగ
నేఁటికబ్బెను మాకు ♦ నిగమవాహ
అనుపమైశ్వర్య మ ♦ హావిభవప్రౌఢి
నేఁటికి సమకూరె ♦ నిష్కళంక
ఘన సదానంద యో ♦ గజ్ఞాన సంపత్తి
నేఁటికి చేకూరె ♦ నిటల నయన

గీ. ఆద్యమై నిత్యమై జగ ♦ దాంతరాత్మ
మై యగోచరమై యజ ♦ మైన నీదు
పాదదర్శనమాట నో ♦ పరమపురుష
భూషిత భుజంగ శారదాం ♦ బుద నిభాంగ. 174

క. పరికించిన నెపుడు సుధా
కరుఁడును భాస్కరుఁడు ♦ యజ్వగగనంబులు న
క్కరువలి కరువలి నెచ్చెలి
ధరణియు యన నీవె కావె ♦ ధర్మవిదారీ. 175

సీ. పరమాత్మ పరమేశ ♦ పరమపావనరూప
దీనసంరక్షక ♦ దేవవంద్య

సర్వలోకాధీశ ♦ శైలజా హృదయేశ
కంఠే కళంక రం ♦ గ ద్వృషాంక
కైలాస గిరివాస ♦ కమనీయ దరహాస
చంద్రఖండ కలాప ♦ శైలచాప
శరధి హారావార ♦ యురగేంద్ర కేయూర
సజ్జనావళిలోల ♦ చర్మచేల

గీ. భూతనాథ మహాదేవ ♦ పుణ్య చరిత
ధారుణీధర భక్తమం ♦ దారభూజ
కమలలోచన వినుత శం ♦ కర మహేశ
నిను వినుతిసేయ నెవ్వఁడు ♦ నేర్చు నీశ. 176

సీ. కాలంబు యజ్ఞంబు ♦ కర్మంబు ఫలమును
మోక్షంబు సురలును ♦ మునులు నీవ
నీవ స్త్రీ పురుషులు ♦ నీవ చరాచరం
బులును దిక్కులు జగం ♦ బులును నీవ
ఖగములు తార లోం ♦ కారంబు సత్వ ర
జ స్తమో ముఖము యు ♦ మ్మస్స్వరూప
ములు నీవఖిల బీజ ♦ ములునై త్రిమూర్తులై
సృష్టి స్థితి లయంబు ♦ సేతువీవ

గీ. నిరుప సద్గుణ నిర్మల ♦ నిత్యశుద్ధ
బుద్ధమైన పరంజ్యోతి ♦ భూతిమై మ
హిమను కేవలమును వెల్గు ♦ దీవు యట్టి
నీవ సర్వంబుఁ దలపోయ ♦ నిగమవంద్య. 177

గీ. ఇట్టి నిన్నుఁ బ్రతీక్షించి ♦ యేత్వదీయ
దివ్యతేజో మహిమను ను ♦ తించనేర
గావునఁ బ్రసన్నమూర్తివి ♦ గమ్ము వేగ
బహుశుభోపేత యాశ్రిత ♦ పారిజాత. 178

చ. అనికొని యాడుచు న్నెనసల హస్తయుగంబిడి సమ్మదాశ్రువుల్
కనుఁగవ జారఁగా నెదుట గాఢతరంబగు భక్తి నున్న య
జ్జనకుని జూచి యిట్లనియె చారుసుధామధురోక్తులన్ జగ
జ్జనకుఁ డపాంగరంగ దధి సమ్యగపార కృపారసంబునన్. 179

జనకునకు శివుఁడు ప్రత్యక్షమై వరము లిచ్చుట

ఉ. ఓయి! నరేంద్రచంద్ర! భువ నోన్నత తావకభక్తి సాత్వికా
మేయనయాదికంబునకు మెచ్చితి నిచ్చెద నిచ్చతోడ నెం
తే యఖిలేప్సితార్థము ల నేకము సంగఁగ వేడుకయ్యె మా
కీయెడ నీకటంచు పర మేశ్వరుఁ డానతి నియ్య నావుఁడున్. 180

వ. సవినయ భక్త్యానందరంబు హృదయంబు నందుఁ గండళింప నానంద బిందు సందోహంబు కందామరలం దిగఁజార ముకుళితకరారవిందుండై జనకుం డిట్లనియె— 181

ఉ. ఓ మహితానుభావ! భవ దుజ్జ్వల సత్కరుణాకటాక్షవీ
క్షామధురామలామృత ర సం బినుమంతయు సోకినంత సు
త్రామసమాన వైభవప దంబును బొందితి నింక నొక్కటే
నామది బాయకున్నది వి సంగ నొనర్చెద నాలకింపవే. 182

గీ. పరమ కల్యాణ సహిత సం పత్కళా ని
ధానమై తగునట్టి సం తానమును భ
వత్పదాంబుజయుగళ సే వాపరత్వ
మనిశ మిమ్మన నప్పుడ య్యాధిపునకును. 183

చ. నరవర మత్ప్రదేప్సిత మ నర్ఘ్యము గైకొని దీని నీవు నీ
పురి గరుదెంచి సుస్థిరత భూపరిపాలన సేయుచున్న యం
చరుదుగ నుండు బొమ్మనుచు నప్పరమేశ్వరుఁ డానతిచ్చె య
చ్చెరువుగ విచ్చుమొగ్గయిన చిత్తముతోడ ధరాధినాథుఁడున్.

చ. తన సతితోడ గూడి విబుధ ప్రకరంబులు మేలు మేలనన్
మనమున నమ్మహేశు మహి మంబులు మాటికి దూటికెన్నుచున్

ఘనత దలిర్పఁగా సఫల కాముడునై జనుదెంచె నాతఁడున్.
దన నిజరాజధానికి ము దంబున పాండవరాజ నందనా. 185

వ॥ తదనంతర కథావిధానం బెట్లని యడుగుటయు.

— ఆశ్వాసాంతము. —

మ॥ తపనీయాచల ధీరసద్గుణగుణా ♦ ధారాసుధారాశి శో
భిపరార్థ్యాయతకీర్తివార యహితా ♦ భీలావలేపాధికా
భ్యపహార్యద్రోర్యుగ సారసారసదళా ♦ తాంఘ్రిద్వయీ పంకజై
కపదానంద రసప్రపూర్ణ హృదయా ♦ కందాళగోత్రోద్భవా.

కం. సుకవివర నికర శుకకుల
సకలేష్ట ఫలప్రధాన ! శతమఖసాలా
వికట పరిపంథిభటలో
క కవి ఘటనసార ఘోర ! కరకరవాలా. 188

మాలినీవృత్తము.

నిరుపమిత విలాసా ! నిత్యలక్ష్మీ నివాసా
సరస సుకవిగేయా ! సాధువిద్వద్విధేయా
విరచిత శుభయూథా ! విష్ణుసేవానుమేధా
పరమగుణసమేతా ! పాపరాయానుజాతా. 189

గద్యము.

ఇది శ్రీశివరామేశానుగ్రహపాత్ర భారద్వాజసగోత్ర
పవిత్ర కాళ్లకూరి సూరకవిపుత్ర, కించిదాంధ్ర
కవితావిధేయ గౌరీకాంత నామధేయ
ప్రణీతమయిన ధర్మనందనవిలాసం
బను ప్రబంధంబు నందు
ప్రథమాశ్వాసము.
శ్రీ శివరామేశ్వరార్పణమస్తు.

శ్రీరస్తు — శుభమస్తు

# ధర్మనందన విలాసము

## ద్వితీయాశ్వాసము

క. శ్రీ రామరాయకుల ర
త్నాకర భవరాజ పాప ♦ యానుజ పుణ్య
శ్లోక ఘనదాన ధారా
ద్రీకృత దిగ్గజనికాయ ♦ శ్రీ గురురాయా. 1

వ. అవధరింపుము జనమేజయునకు వైశంపాయనుం డిట్లనియె. 2

ఆ. అట్లు సఫలకాముఁ ≀ డై జనకావనీ
జాని తనదు రాజ ≀ ధానిఁ జేరి
సకల జనులుఁ గొలువ ≀ సామ్రాజ్యవంతుఁడై
సుఖము బడయుచుండె ≀ సఖియతోడ. 3

వ. తదనంతరంబ—

క. ఆరాజేంద్రుని యువతి ను
నూరమకున్ నెల మసలె వి ≀ నూతనమై క్రొ
క్కారు మెఱుఁగు లోనై వెలుఁ
గారెడి కాదంబినీ మ ≀ హాత్మ్యము దోపన్. 5

సీ. ఒడలు నీర్వట్టె నె ≀ న్నడ లలసటమించె
నడుము బయల్పడె ≀ తొడవు లిరికె
వళులు హరించె కో ≀ ర్కులు మించె చన్నుము
క్కులు నలుపయ్యె చె ≀ క్కులు వెలసెను
చిట్టుములఁ దొట్టెను ≀ రెట్టించెఁ దెల్వ క
న్నుల నొకి లింతలు ≀ బలువుకొనియె

కును కెక్కుఁడయ్యెను ♦ దినమన్న రుచియయ్యె
దినమన్న మనుకార్శ్యమ్ము ♦ మనుసరించె,

గీ. సఖులు ముచ్చటవినఁ జెప్ప ♦ సైపడయ్యె
నూరువులు మిక్కిలయ్యె నో ♦ యారసాగె
నాఁడునాఁటికి కొంతకొం ♦ త గననయ్యె
గర్భ చిహ్నము లా సుధా ♦ కరముఖికిని

గీ. నెల లొకటిరెండు దప్పిన ♦ దెలిసి ఘన త
పో ధనులఁ చేతఁ జేయించె ♦ పుంసవనము
రాజచంద్రుండు తన మనో ♦ రమయనంగ
దగు మనోరమ కధిక మో ♦ దంబుతోఁడ.

క. శ్రీమంతుఁడైన భూ భృ
త్స్వామి యొనిమిదవనెల బ్ర ♦ సన్నద్విజవా
క్సామాన్యముతో గర్భ
క్షేమంబునకై రచించె ♦ సీమంతంబున్.

క. నవమాసము లిట్లత్యు
త్సవముగఁ గడతేర ప్రసవ ♦ సమయం బైనన్.
పివరింపదు జవరాలవు
నవు నంచున్ వృద్ధ మహిళ ♦ లరుదెంచి తగన్.

సీ. పాలన్న మిడి పైడి ♦ పళ్లెంబుతోఁ దెచ్చి
కొను కొను మని యొక్క ♦ కొమ్మ యొసఁగె
తిన శక్యమా నేనుఁ ♦ దినిపించెద నటంచు
గొబ్బున నొక లత ♦ కూనఁ గనియె
గడెయనే పోరిచి ♦ కబళంబుఁ దినఁబెట్టె
వద్దనఁగా నొక్క ♦ ముద్దుగుమ్మ
ఝుడియకు మమ్మ స్త్రీ ♦ జన్మమే కష్ట సం
బారంబనియె నొక ♦ కీరవాణి

గీ. ఇరు గడలఁ జూచు కలకంఠ ♦ లెల్ల దొడ్డ
గండమిది తప్పు టధిక భా ♦ గ్యం బటంచు
బలికి యిలవేల్పులకు వేలు ♦ పులకు మీఁదుఁ
గట్టఁజేసిరి భూధరా ♦ గ్రణికిఁ దెలిపి. 10

క. కొందఱు ప్రియాళులటఁ జని
కొందల పడు భూధరేంద్రు ♦ గూరిచి పలుకన్
మందుల సుఖప్రసవమును
బొందించ నొసంగ రాగ ♦ మునఁ బిలిపింపన్. 11

గీ. విప్రవరు లేగుదెంచి భూ ♦ భృద్వరేణ్యు
జనువు గొనుచు నారణ్యా ని ♦ స్వన మొనర్ప
బడసె సౌఖ్యప్రసూతి య ♦ ప్పడఁతి మిన్న
యమల తరమైన శుభలగ్న ♦ సమయమునను. 12

జనకునికి కళావతి పుట్టుట

శా. ఆ రాజేంద్రునకున్ మనోరమకుఁ గ ♦ న్యారత్నమున్ గల్గె శృం
గారాకారిణి సత్కళాభరణి రం ♦ గచ్చంచలావల్లి బం
గారంపుంజిగిప్రోడు నూత్నశశిరే ♦ ఖాలక్ష్మి శీతాద్రికిన్
గౌరీదేవత పద్మినీ వరునకున్ ♦ గాళింది చందంబునన్. 13

ఉ. ఆ రుచిరాంగి బుట్టు సమ ♦ యంబున దివ్యవధూటులాడి రం
భోరుహబాంధవాది ఖగ ♦ ముల్ విలసిల్లె వెలంగె దేవతా
భేరులు మ్రోసె వార్నిధులు ♦ పెంపుఁ గనన్ జిరుగాలి వీచె మం
దారలతాంతవృష్టి వసు ♦ ధార రమందిర భూమిపైఁ దగన్. 14

క. అనలుఁడుఁ బ్రదక్షిణార్చులఁ
దనరెఁ గల జంతుకోటి ♦ తతసంభ్రమ సం
జనకస్వము లొనర్చెను
మునులు నుతించిరి ప్రమోద ♦ ముఁ గడలు కొనన్. 15

ఉ. అంతట నమ్మహీధర కు ♦ లాగ్రణి సంతస మంది పార్వతీ
కాంత కృపారసంబునను ♦ గల్గిన సంతతి కుత్సవంబుగా

ప్రాంత సమాగ తద్విజకు కేలాళికి నిష్టఫలోపలబ్ధి న
త్యంత ముదంబు నించి సమ యంబునఁ జేసెను జాతకర్మముల్
శా. జాతాశౌచ దినంబులెల్లఁ జనినన్ సర్వంసహా భృద్వరే
ణ్యాతి ప్రీతిగుతించి సంచరితపు ణ్యాహంబు మీరెన్ ద్విజ
వ్రాతోద్దీప కలస్వనోప భరిత బ్రహ్మాండ [1] పూర్ణేయశో
ర్వేతాద్భృఘ్మున శోభనావహామ ఖం బేకాదశాహంబునన్. 17
క. దానిఁ గళావతియని యభి
ధానంబున రాజసన్నిధానస్థులు చం
ద్రానూన కళావంతుని
దైన మహాభిఖ్య యతని కాత్మార్థముగాన్. 18
వ. అంత. 19
గీ. వేడుకలతోడ వాడల వాడలఁగల
చేడియలుగూడి మేల్పైడి మేడలోన
జిలుకుపని తొట్లలోపల జేర్చి జోల
బాడి రాలింప నిరుగేలఁ బట్టివట్టి. 20
క. నెలతుకలుఁ గూడుకొని చి
న్నెల వెన్నెల రేలు పాలు వేతులతోగి
న్నెలఁ బువ్వలుఁ దినిపింతురు
నెలఁబాలునిఁ జూపి రాచ నెలకూనకొగిన్ 21
చ. కలికులతోడ నేస్తములు గట్టిన గుజ్జన గూళ్లువండి విం
దులకును బిల్చుఁదీగెలకు దోహదముల్ సవరించి పల్కు జి
ల్కలకు విపంచిమీటి కుల గానము నేరుపు వియ్యమందఁగా
దలఁచును బొమ్మపెండిలిలు దప్పక సేయుచు నాఁడు నాఁటికిన్.

కళావతీ వర్ణన

వ. ఇవ్విధమ్మున దినదినప్రవర్ధమానినియైన మానినీమణికి నభినవ
యౌవనారంభం బైన- 23

1. "గేహంబు పూర్వేతాద్భ అని పాఠాంతరము—

అమ్మహారామోత్త ♦ మమ్మున కథరస
త్కార తరల కిసలయ ♦ స్ఫురణమించె
రద నఖ కుంద కో ♦ రకములు దనరె నా
భియును నా పొన్న సం ♦ పెగలు విరిసె
కరములన్ గ్రొవ్విరి ♦ సరములుఁ దూగాడ
కమ్మన మొయిదీగ ♦ జిమ్మసాగె
భుజములు శోభావి ♦ భూతి పుష్పాడి గప్పె
పలుకులం దేనియ ♦ లొలుకుచుండె

గీ. కుచ లకుచములు మడమల ♦ రుచిరవట ఫ
లములు పండెను నెఱులను ♦ భ్రమరకములు
గుంపుకొనె కంఠరవ పిక ♦ ఘోషమెసఁగ
జవ్వనంబున [1]బొంగు నా ♦ సమయ మందు. 24

సీ. నలినాక్షి వేణి ఘ । న శ్రేణి వదనంబు
చంద్రబింబప్రభా । వదనము శ్రుతు
లభినవాకృతులు జా । పాధరం బధరంబు
కరములు కమ్మ క్రొ । వ్విరి సరములు
కుచములు ఫలితల । కుచములు నూగారు
నల్లచీమలబా । ర సంతము నడు
మిల కటిస్తలము మ । దేభకరము లూరు
వులు మకరములు జం । ఘలు మడమలు

గీ. వటఫలంబు లుఘులు లును । ప్రదములు నఖ
రములు తారక లనగ గం । ధము కవురము
గమనము మరాళ్ల గమనంబు ♦ కాంతిహైమ
మంగము శిరీష పే శలం । బౌర సతికి. 25

చ. పొలతుక కొప్పుతో సవతుఁ । బోలఁగజాలక రాహువా మహో
బిలమున వాష్టై కాబ్దమతి । భీతి దిగంతములందు బర్వె కొం

1. “గుసుమరుతు” అని పాఠాంతరము.

డల వనవాటి తుమ్మెదల । గాంచు నదీనద పుష్కరాంతర
స్థలములఁ జేరె చీఁకటుల । సాయనబోలును నిల్చియుండినన్. 26

గీ. సరససౌందర్య లా వణ్య । సరసి నుద్భ
వంబయిన పద్మ మన వద । నంబు మీఱె
నమరు లేదరగల పోల్కి । బొమలు బేడి
సలవిధంబున దనరె గ । న్నులు సతికిని. 27

గీ. కర్మశుష్కుళికలన వాం । కప్రభావి
భూతి దనరారిను శ్రీ వి । భూతి మించె
మగువ చెక్కులు నొసలిందు । మండల ము త్రి
ఖండములు జేసుకొన్నట్లు । గాఁదనర్చె. 28

గీ. రమణిలోచన ఖంజ రీ । టముల దీము
వీలుగను యువతీ మనో । మృగచయంబు
నీక్షణాస్త్రములం గుమ్మ । నిరుగరముల
నెత్తు మరువింటి కొమలంబు । జేతుబొమలు. 29

క. చిరుదరగల చందంబున
మరుని పతాకల విధమున । మంజుల లతికా
స్ఫురణను గురువిందా ధర
కిరవ్రెందున్ భ్రూయుగంబు । నెంచఁగ నధిపా.

సీ. కోరికఁ డాయుచ । కోరకంబులకును
విరిజూపు వెన్నెల । విందువెట్టె
దళమెత్తుకొని వచ్చు । విలసితకైరవం
బుల నీటిలోపల । మునుఁగఁ జేసె
ఱెక్కలకోపుల । నిక్కు కాటుకపిట్ట
లను వననాటుల । మఱ నొనర్చె
దినదినాభ్యుదయంబు । గని నూటులే మొనల్
గదియించు తమ్ములు । నదుల నదిమె,

గీ. కాకయుండిన సమమెన్న గా తరంబె
చేరలను గొల్వఁదగి కడ చేవులంటి
నల్పు ఱెప్పల కడలలో దెల్పుఁ గల్గి
చెన్నుఁగల వన్నెలాడి వా ల్గన్నులకును 30

చ. మిలమిలలాడు తుమ్మెదగ మింగికురించి ప్రసూనధన్వి క్రొం
జిలుకలకున్ మొనల్ గొలిపి చిన్నిరెయొయారపు లేడికందులన్
పులఁగొనఁ జేసె నిండయిన పున్నమవెన్నెల చెన్నుదన్నియ
న్నులగమి మిన్నచూపుల మనోహరవృత్తిఁజరించు నేర్పునన్

చ. వనతరు జాతమందు వెలి వడ్డది గంధ ఫలిప్రసుమంబు క్రొ
న్నన మరునారిచే మును గ నంబడ దుశ్శకునంబటన్న నిం
దనుఁగొనె నువ్వులార్ద్రి సవ తండ మదెంతని రోటకీలు వే
సిన గతి నాసభాసిలు వ శీకృత పట్పద శోభనాకృతిన్ 31

గీ. చానకంఠరవంబులో పవతురాని
పిక ని కాయంబు పరభృతా భి ద వహించి
జేసి మధుసేవకాకలి చెలువుఁజూపె
గాక పదసంగతినిఁ బొంద గాబనేమి. 32

గీ. పలుకుఁ బలుకును తేనియ జిలుకు చిలుక
బోధలను పెంచి పదపద్య ములను నేర్పు
నేర్పుకొనునంచు దాచిన నెలవెరింగి
యాణు లందిచ్చిన విపంచి మేళమించి. 33

గీ. పలువరుస దాడిబీజమ పద్మరాగ
శకలముల మొదటనేగెల్చి సవతువచ్చు
ముత్తెముల మల్లెమొగ్గల జొత్తడంచి
తుదనుమగరాలమూలల నెదుగఁజేసె, 34

క. చిరునగవు లేతవెన్నెల
నరమురిగాఁ జేయు కపుర మాళుల మీదన్

విరజల్లినట్లుఁ దోఁచును
వరవర్ణినిఁ బొగడఁదరమె § వసుధాధీశా.

సీ. స్మిత సుధాబిందు న । మృతమాటచేత న
　　　　య్యమృతంపు ఘుటికయం । చనఁగవచ్చు
నతులారుణామూల్య । గతి రంజిలుటఁజేసి
　　　　పద్మరాగంబని । పలుకవచ్చు
మహిత మార్వ్వతగుణో । ద్వహనమై యుండుట
　　　　చిగురుటాకనుచు వ । చింపవచ్చు
తాంబూల రసకోష్ఠ । తాశువ్యమగుటచే
　　　　విద్రుమంబనుచు భా । వించవచ్చు

గీ. కఠినతాశాణ కర్షణా । కార భేద
ఖండనల నొందకున్న । నఖండమహిమ
దనరిఘన మాధురీ దురం । ధరత నమరు
నళిన పత్రాయతాక్షి దం § తచ్ఛదంబు.

క. కమనీయ తాళబీజ
క్రమమున గొమ్మ చుబుకమ్ము ♦ కంఠమశంఖ
క్రము కము లెదరిన దరమిడి
నమలబరచె నాకులపడి ♦ నరకులనాథా.

క. విధివరమున తమిలోఁగొని
యధరారుణ బింబమునకు ♦ నధరగతి సదా
పృథగాత్మ నిలుచు కవికవ
విధమున కుచయుగము దనరు ♦ విమలాననకున్.

సీ. తామరమొగ్గల ♦ తో మొనల్ పచరించి
　　　　పువ్వుబంతులఁజూచి ♦ నవ్వినవ్వి
మారేడుబళ్ళ ర ♦ మ్యంబెల్ల విదళించి
　　　　గజనిమ　　హాం ♦ కము వహించి

తాళఫలైక వృ ♦ త్తత యెంతయనిరోసి
కిన్నెరకాయల ♦ చెన్నడంచి
మొలక బంగారు కుం ♦ డలకు వన్నెలు దిద్ది
కుంభి కుంభస్థిత ♦ గుంటువరచి 38

గీ. శైలిశృంగకలితను ♦ గేలిజేసి
వలుదలయి వట్టువలపైన ♦ నలుపుగలిగి
యెదను నిండారి యెడమీక ♦ యించుకేని
గుబ్బెతలమిన్న సిబ్బెంపు ♦ గుబ్బలమరు. 39

క. క్రొన్ననతో మాలికలను
తిన్నన ప్రూలతల తూల్చ ♦ దెగ డిన భంగిన్
కన్నియకు బాహు లమరును
వెన్నరిటాకువలెఁదోచు ♦ వీక్షింపంగన్ 40

ఆ. పొక్కిలనెడి పొన్న ♦ పువ్వులోపలనుండి
తను లతా స్తన ప్ర ♦ ధాన సూన
గుబ్బములకుఁజేరు ♦ కొనుతేఁటి పిల్లల
చాలనంగ నారు ♦ బాలకలరు. 41

గీ. పరసులనుమంజ పున్నాగ ♦ సముదయమును
పణతి పొక్కిలి భ్రమపాలు ♦ బరుపకున్న
కుంభిపై నెక్కి ద్వీపముల్ ♦ గొని యరుల జ
యింపరే రట్టి సంపత్స ♦ మృద్ధితరిని. 42

గీ, కౌదమతుమ్మెద చాల్ మృగ ♦ మదము శక్ర
నీలములు నల్లచీమల ♦ చాలు ఫణియు
దనరు నుపమానముగ వాని ♦ కధికమౌట
నాఱనిడి పేరుగల్గెకో ♦ నూవళికిని. 43

క. కడుపు వటదళము నెన్నక్
నడుము విలాసంబహీయ ♦ నంతము పొగడన్

జడలుగలుగు వనవాసికి
పిడికిట గొనుటను గాను ♦ పింపక యునికిన్.

గీ. కరభకంబులు గరతల ♦ గతములయ్యె
నరటికంబంబు లెదురేగి ♦ పొరలఁజొచ్చె
కరికరము లొంగి కంపింప ♦ గాఁదొడంగె
చేడె నిద్దంపుఁ దొడలతో ♦ నీడుగాక.

గీ. తరుణి జంఘాభ్యుదయము చి ♦ త్రంబుగాదె
కాహళులు మొఱయఁగ పొరల్ ♦ గట్టిమహిమ
కరములను బట్టి వరశాలి ♦ గర్భజయము
గాంచె మొదలూడ్చి ఘనశకా ♦ ఘముల ముంచె.

ఆ. ధనదు ప్రోలి కొకటి ♦ ధరక్రింది కొక్కటి
బారినిల్చె గచ్ఛ ♦ పమ్ములట్లు
గాకయున్నతులయె ♦ కాంత మీగాళ్లకు
మజ్జిపండు లీడె ♦ మడమలకును.

క. తోరంపు ముత్తియములకుఁ
దారకలకు చవులొసంగు ♦ తరుణి నఖంబుల్
నీరజ ఝషధర రేఖా
కారకరాంగుళులు పెసర ♦ గాయలు పొగడన్.

చ. పసిడి శలాక పువ్వులత ♦ భాసుర చంచల చంచలాక్షి మే
ని సొగసు మార్దవంబు బుర ♦ ణించు శిరీషసుమంబుతోడ సా
రస నవ పాటలంబులను ♦ రాజిత చందన చంపకంబులన్
గసరు వధూశరీర భవ ♦ గంధము సద్మనసార సంపదన్.

గీ. కరిణికిని మందయానమే ♦ కరణిఁగల్గు
వడిబడుటఁగాక హరి మధ్య ♦ నడకగన్న
హంసమెటు తుల పాదాంగ ♦ దాభిధాన
మొంది యడుగుల పెఁబడ ♦ కుండెనేని

సీ. గోళ్లుము త్తియము లం ♦ ఘ్రులు కమలములు జం
ఘలు దాన వ్రూరువుల్ ♦ కరభగములు
వెన్నరటాకు నా ♦ భి సరోవరంబారు
దర్వీకరంబు ము ♦ త్తరులు తెరగ
లరిచేయి కడుపు పె ♦ సర బంధు ర్వేళ్ల హ
స్తములు తామరతూళ్లు ♦ స్తనములమరు
బంతులు కంఠ మ ♦ బ్జము మోవి చికురాకు
చెక్కుటద్దంబులు ♦ ముక్కు గంధ
ఫలి పలుకు చిలుక కన్నులు ♦ త్పలము వీక్ష
చంచల కనుబొమలు విల్లు ♦ శ్రవణములచ
వాకృతులు మోము మకుర బిం ♦ బాంచితంబు
కొప్పు బర్హంబు నొందగ ♦ కోమలికిని. 51

ఉ. ఆముకు రాస్య యావెలఁదికి యా తరుణీమణి యా మిటారి యా
భామిని యా సుధా మధుర ♦ భాషిణి యాకలహంస యానయా
తామరసాక్షియా కుసుమి ♦ తవ్రతతి ప్రతిమానగాత్రియా
కోమలి బొల్చునిల్చు మెఱుఁగోయన నిండిన జవ్వనంబునన్. 52

న. అంత — 53

— ♦ నారదుఁడు జనకుని యాస్థానంబునకు వచ్చుట. ♦ —

సీ. మిన్నేటినిండ నిం ♦ పిన సుధారసతుల్య
జలములతో మణికమం ♦ డలముతోడ
స్వరయుక్తముగ రమే ♦ శ్వరుని గానము సేయు
వీణతోఁ దగు వామ ♦ పాణితోడ
శ్వేత తీర్థ్వపుండ్ర లాం ♦ ఛితములై తగు నంగ
కములతో బాసవా ♦ ల్గములతోడ
నుదయారుణప్రభా ♦ స్పద జటామకుట ధీ
ధితులతో కావిధో ♦ వతులతోడ

గీ. దక్షిణకరస్థమగు త్రిదండంబుతోడ
నధిక సాత్త్వికరుచి విగ్రహంబుతోడ
సరణి వినమితులగు వియచ్చరులతోడ
జాళువా తమ్మివిూసల సరులతోడ. 54

ఉ. తామరసాప్తుఁడేల వసుధాస్థలికాగతుఁడయ్యె నంచు వి
భ్రామితచిత్తులై జనులు బల్మరు మెచ్చుచు జూచుచుండ దే
హామలదీప్తితోడ కలహాశనుఁ డభ్రమునుండి వచ్చె సు
త్రామగృహాభిశోభి మిథిలాధరణీధవధామ సీమకున్. 55

వ. ఇట్లు వచ్చిన బ్రహ్మపుత్రునిం గాంచి జనకభూజాని సతియునుం దాను నెదుర్కొని యభినందనంబు లొనర్చి, యర్ఘ్యపాద్యాది విధులం బూజించి, యనర్ఘ్యమణిమయ సింహాసనోపవిష్టుంగావించి, దన కూతురను రావించి యమ్మహానుభావునకు మ్రొక్కించి, తదీయానుజ్ఞల గాంచి, యుచితాసనంబున నధిష్ఠించి, కరకమలంబులు ముకుళించి వినయానందంబు లంతరంగమ్ములం దురంగలించఁగా నిట్లనియె. 56

క. మౌనీశ్వర మీ రాకడ
చే నేము కృతార్థతం భజించితి మిట్లున్
శ్రీ నెరయుచును బవిత్రం
బై నెమ్మిన్ మెఱయుచుండె నతులిత మహిమన్. 57

వ. అదియునుంగాక దేవా! మహాత్ములరాక యమోఘకల్యాణకారణంబని పెద్దలండ్రుఁ గావున భవదాగమంబత్యంత శోభాప్రధాన మహిమాభిరామంబని వినుతించుచున్న యన్నరేంద్రునకు మౌనీంద్రుండు రాజచంద్రా! నీ గుణంబులు సన్మార్గసేవితంబులు, సర్వసులభంబులు గాన, నీ ప్రాభవంబు లెఱుంగ, నితరుల కసాధ్యంబులు. తొల్లి మీ వంశకర్తయగు నిమినామధేయుండు పరమభాగవతోత్తములకు తత్త్వమార్గంబులుఁ దెలిపె. నతని మహిమా

విభూతులు వర్ణింప నగణితంబులు. తద్వంశోద్ధారకుండ
వగు నీవు, నట్లు పరమనీతికళాకుశలుండ వని పలుకునెడ కేళికా
వ్యాజంబున సెలవిమ్మని పునర్నమస్కారం బొనరించి, ముకుళిత
కరారవిందయై యున్న యక్కన్నియం గాంచి, వైదేహుని ముఖం
బాలోకించి, ముఖంబునం జిఱునవ్వొలయ నిట్లనియె 58

క. దీవించి దేవముని తన
భావంబు గ్రహించి వంశ ♦ పావని యిది కా
ళీవర వరమున నీగ
ర్భావాసంజనిత యయ్యె ♦ నతినయవతియై. 59

నారదుఁడు ధర్మరాజునకుఁ గళావతి నిమ్మనుట.

గీ. దీని భారతవంశ ప్ర ♦ దీపకుఁడగు
ధర్మనందనునకును సుం ♦ దరిగఁ జేయఁ
బుత్రికను గన్న భాగ్య మ ♦ బ్బును నిజంబు
నీకు నతఁ డల్లుఁ డగునని ♦ ప్రాకటముగ. 60

క. జత బంగారంబునకున్
రతనమ్మది గాన జనక ♦ రాజేంద్ర శుభ
స్థితినుండుము పోయివచ్చెద
సతతంబని పలికి మౌని ♦ జనియె నిజేచ్ఛన్. 61

క. చని కౌంతేయాగ్రజునకు
జనకక్షితినాథు తనయ ♦ సౌందర్యము త
జ్జనన ప్రకార మంతయు
వినిపించి విరించి కొమకు వేమఱుఁ బలికెన్. 62

క. కన్నియల ముజ్జగంబుల
గన్నాఁడ విదేహరాజ ♦ కన్న తనయ బో
లన్నేర రింతి సొగసుల
గున్న సుమీ భరతవంశ ♦ కుంజర వింటే. 63

చ. తళుకు మొగంబులాగు కను ♦ దమ్ముల బాగు గళంబుతీరుచే
తులహావణాపు చన్నుగవ ♦ తోరము మేని నిగారనుగ్ గటి
స్థలము వెడల్పు లేనమము ♦ స్వల్పము వేల్లతనర్పు పల్కు తే
నెల గతి నేర్పుగల్గు తరు ♦ ణిన్ ధరణీస్థలిఁ జూడ నెన్నఁడున్. 64

సీ. దాని పెన్నెత్తుఁ గొప్పు ♦ దాని నవ్వు మొగంబు
దాని నుంజెక్కుటద్దములు ♦ దాని
ముద్దు మాటలు దాని ♦ మురవైన వాతెఱ
దాని విశాల నేత్రం ♦ దర్శ్యతరము
లైన వాల్గన్నులు ♦ దాని మిటారంపు
చూపులు దాని మం ♦ జులకరములు
దాని చన్బంతులు ♦ దాని సన్నపుఁ గౌను
దాని బల్ పిఱుఁదులు ♦ దాని యంద

గీ. మైన తొడలును దాని యొ ♦ య్యారఁపు నడ
దాని మేలి కడాని జి ♦ గాని గార
మైన మేనును దాని సో ♦ యగము గనిన
వేయు నేటికి యతిధైన ♦ విధముఁ జెడఁడె. 65

ఉ. నీటు నొయారఁపు న్నడలు ♦ నీటును వేనగుపాటు గబ్బిచన్
గ్గోటు కటీనటత్ ఘటిల ♦ కుంతల పాశపు వేటు నిగ్గ కన్
గాటుకఁగీటు నెమ్మొయి చొకాటఁపుపూటి విలాస కోటికిన్
పాటలగంధి పాపటయు ♦ బాట సుమీ మరునాట పాటకున్. 66

వ. అని వలఁపుఁ గొలుపం బలికి కలహాసనుండు కురుకులపతిం దీవించి తదనుజ్ఞ వడసి యెందేనియుం జనియె నంత. 67

ఉ. నారదు మాట వీనులను ♦ నాటిన నాఁటగ నవ్వగనూటిలోఁ
గూరిన మోహభారమున ♦ కోరిక లీరికలెత్త రేపు మా
పారని తాపమోర్వక ప్రి ♦ యాళులతోఁ మరుమాటలాడకే
చేరిక మాని వేదురను ♦ జెంధిన చందముగా వసించుచున్.

నారద వృత్తాంతంబు విని కళావతి మోహభ్రాంత యగుట

చ. నరపతి రూపు చిత్తరువు ♦ నర్మిలి వ్రాయించి తదీయదర్శనం
బరుదుగఁ జేయు కీరముల ♦ నాతని సద్గుణ గౌరవంబు లే
ల్పరచుచు సారెసారె పద ♦ పద్యము లర్మిలినేర్పు వీణచే
భరతకులాధినాయకుని ♦ బల్కును బాడు రహస్య వేళలన్. 69

వ. మఱియును. 70

సీ. అలికభాగంబున ♦ తిలకంబు దిద్దుచో
సుతతిచే ముకురంబు ♦ చూచుకొనదు
విరుల దండలు తన ♦ వ్రేసలి దుఱుముచో
నలకల మువ్వ కో ♦ దండముగను
నగలుంచు కొమ్మని ♦ ననుదాల్చు పన్నీట
జలకంబులాడన ♦ సహ్యామందు
ఆరగింపుము కూడుఁ ♦ గూరలంచనినను
సగపడకసిగాటు ♦ లుగ భుజించు

గీ॥ కనకపంజర శుకశారి ♦ కలకు మించి
పద్యములుఁ జెప్పు మనమార ♦ బలుకకుండు
వీణగొని గానమొనరింప ♦ వేయటన్న
భ్రాంతిపడి తంతి విడి ♦ గోటఁబయలు మీటు. 71

చ. తలఁపు వచింప నెవ్వరికి ♦ తత్తరమందక నిమ్మళించు లో
గులుకుచునుండ దానిపలు ♦ కుల్వివిన దాకలి కన్నపానముల్
దలఁచదు; పుష్పవాటిగెలను ♦ దాపులు గొల్పను నీరుబోయ దం
కిలి యొనరించి మారుఁడెద ♦ గేదఁగి ఱేకునమొవ్వఁ జేయగన్. 72

—♦ యోగానందుని ధర్మజుఁగొల్వకు బంపుట ♦—

శా. ఆలో నొక్క నరలలామము తదీ ♦ యంబైన మోహాంబుదా
నాలోచించి రహస్య కృత్యముగ కా ♦ ర్యం బద్ధిగావించు వా
చాలున్ గౌతమపౌత్రు రాబనిచి హా ♦ స్తద్వంద్వమిష్టాప్తిగా
మాళిన్ దాలిచివల్కె నీ గతి వచో ♦ మాధుర్యధుర్యంబుగన్. 73

గీ. ధరణిదేవ! శతానంద ♦ తనయుఁడనగు
నీవు మిక్కిలిఁ గూర్తువు ♦ నృపతనయకు
గాన నెక్కడ నెవ్వరు ♦ గానకుండ
నరుగవలయు నింద్రప్రస్థ ♦ పురమునకును.

వ. చని యందు ధర్మనందనుని సవినయంబునం గని.

ఆ. తనివి లేని వేళ ♦ చనువు సంగని వేళ
తినకయున్న వేళఁ ♦ గునుకు వేళ
ధనము చెడినవేళ ♦ తప్పు లెంచెడివేళ
మనవిఁ జెప్పరాదు ♦ మనుజపతికి. 76

గీ. కుడిచి శ్రమమార వీడెంబు ♦ గొనెడివేళ
వాసనాద్రవ్యములు మేన ♦ బూసి కొలువు
నందు విరిఁదోఁట నానంద ♦ మందు వేళ
చనువుతోఁ జెప్పుమనవి రా ♦ జన్యునకును. 77

క. భరతకులోత్తముఁడు స్వయం
వరమున కేతెంచి వేగ ♦ వైదేహసుతన్
పరిణయమగు మని తన్మతి
పరిపాకముఁ దెలిసి కార్య ♦ పరుడవు విప్రా. 78

ఉ. నావిని కట్నకానుకలు ♦ నల్గడలంది పురోహితోర్వరా
దేవుఁడు వారివీడ్కొని ♦ తీవ్రముగా జని యొక్కఁడా పృథా
దేవి కుమారుఁ గాంచి తగఁ ♦ దీవనలిచ్చి వసించి తత్కృతా
ఖ్యావళిఁ గాంచి విస్మయము ♦ నందు వసించిన నాతఁ డిట్లనున్. 79

ఉ. ఏ యెడనుండి నే యెడకు ♦ నేగుచు నీ యెడ కేగుదెంచినా
రో! యవనీసుపర్వ భవ ♦ దుర్వర నేలు నృపుండు ధర్మసం
ధాయకుఁడే, ప్రజల్ సుఖులె, ♦ ధారుణి పండునె చెట్లు నిత్యమున్
బూయుచు కాయుచున్నె యుడి ♦ పోవక గోవులు పాలొసంగునే. 80

శతానంద సుతుండు గళావతీవృత్తాంతంబు ధర్మతనయునకుఁ జెప్పుట

వ. నావుడు శతానందుని సుతుండైన యోగానందుం డిట్లను, దేవా! విదేహదేశంబునకు నాయకీరత్నంబైన మిథిలాపురంబు గలదు.

సీ. ఆ రాజధానికి ♦ నాధిపత్యము సేయు
సకల ధాత్రీజన ♦ జనకుఁ డగుచు
జనకుండు విజ్ఞాన ♦ సనకుండు, కలనైన
వినకుండు పిశునుని ♦ విన్నపంబు
గనకుండు పరకాంత ♦ లను గడచూపుల
ననకుండు కడనాలు ♦ క ననృతంబు
గొనకుండు నిల తన ♦ కోరుగాని ధనంబు
జనకుండు నన్యాయ ♦ సరణి నెపుడు

గీ. తాను ముందు వినకుండుమి ♦ త్రతతి విడచి
యగ్రమున నుండు సంగ్రామ ♦ మావహిలిన
వెనక వెనకుండు కొలదొర ♦ కొనెడుచోట
తనివి సనకుండు హరిపద ♦ ధ్యాననిరతి. 82

క. అతనికి నీశ్వర వరమున
సుత గలిగెను రతిసమాన ♦ శోభిత గాత్రాం
చిత సుగుణాళ్చతురతచే
చతురబ్ధి పరీతభూమి ♦ జనసన్నుతయై. 83

వ. మఱియును. 84

సీ. అళి సుధాంశు ధనుర్న ♦ వాదర్శనల పత్ర
కచ ముఖ భ్రూ కర్ణ ♦ గండనేత్ర
కనకాతుకుందేశు ♦ కలకుదచంద్రికా
ఘ్రాణ దృగ్దంతోష్ఠ ♦ కంఠహాస
క్రముక చిసాద్రి ప ♦ ల్లవహారవల్లికా
గళబాహు కుచపాణి ♦ తల నభాంగి

ఘ్నోతలావర్తాభ్ర ♦ కదళీభ కాహళ
కటినాభి మధ్యోరు ♦ కమల జంఘ

గీ. కలిత పాటలా చంచలా ♦ గంధకాంతి
సూన నవనీతకోమలా ♦ సూన మృదుల
భావసంభవ మోహనాం ♦ బకము తివి
దనరు నయ్యింతి వర్ణింపఁ ♦ దరమె యధిప. 85

ఉ. నీటు మెయూరపున్ న్నడలు ♦ నేటను తేనగుబాటు గుబ్బచ
న్గొటు కటీనటత్కుటిల ♦ కుంతలపాశపు వ్రేటు సోగక
న్గొటుక గీటు నెమ్మొయి చొ ♦ కాటఁపుపూటు విలాసికోటికిన్
పాటలగంధి పాపిటయు ♦ బాటగదా మరునాట పాటకున్. 86

చ. జనకుఁడు కూతుఁ బెండిలికి ♦ చాటఁగలండు [స్వయంవరంబునం
దనువుగ గూడి బంధుల] స్వ♦యంవరవేళ వరింపరమ్మొ మా
జనకజ నావుఁ డిష్టపడి ♦ సమ్మతివచ్చెదనంచుఁ బల్కెన్
విని మగుడన్ ద్విజుండు నృప ♦ వేగమె రాఁదగు జాగుసేయకన్.

## శతానందసుతుండు మిథిలకు తిరిగి వచ్చుట

వ. అని విన్నవించి తదనుజ్ఞ గాంచి బహూకరంబుగా నింద్రప్రస్థ పురంబు నిర్గమించి యథాసుఖగమనంబున నదీ నద పుర గ్రామ తరు గిరి ప్రముఖంబులు దాటి మిథిలానగర మార్గంబువట్టి చను దెంచు చుండె నంత. 88

## సాయంకాల వర్ణనము

ఉ. జారె మరీచికల్ కువల ♦ షండము నిద్దుఁదీరె తమ్మి బెం
పారె రథాంగ యుగ్మమున ♦ కాపదగూరెను వారుణాశజన్
జారె పతత్త్రిసంఘములు ♦ వ్యోమపథంబున బారె పంక్తులై
మీఱె తమంబు తూర్పున శ ♦ మించె నినోష్ణము భూతలంబునన్. 89

[సంపాదకపూరితము]

క॥ సరసుల నుడికించితిరే
పరులకు మేలోసఁగి కువలయ ♦ పతి నణచియు స
త్పరి వృఢుఁ డేతెంచె న
త్తరి భయామగు ననెడుభంగి ♦ తపనుఁడు గ్రుంకన్. 90

క. యరలింగి బోడిచె నత్తరి
హరిద్యైతగు హరి కటిస్థ ♦ లావృత పీతాం
బరకాంతి చందమున న
బ్బురమున వారుణము హరిద ♦ భోభాగమునన్. 91

గీ. తనకు పగవాఁడు హరి త్రయీ ♦ తనుఁడు సాయ
మనెడు వర్షాగమంబున ♦ నంబురాశి
బండజన నిండె బ్రహ్మాండ ♦ భాండ మంధ
తమము తద్రిపు దైత్య యూ ♦ థంబువోలె. 92

## తమోవర్ణన

వ. మఱియు నంధకారంబనేక ప్రకారంబుల నవారితంబై మీఱి నిశాచరానీకంబులు చెలంగుచు, మిత్రతత్వంబున సర్వరక్షణంబుసేయుచు, సురోత్తముండైన హరి సముచితసాయం సమయంబను వర్షావసరంబున సముద్రాంతరంబున నిద్రాముద్రితుండఁగుట యెఱింగి తూరుపుకడనుండి యచ్చట సద్విజుల సామిసోదరుండైన దామోదరుండు లేమి నొక్కఁడు దిక్కుమాలి పాలింపుచున్నాఁడని బెదిరింపఁ దరి తోలి దిక్కాక్రమించి, యవ్వజ్రపాణి మణిగణ విజృంభణంబు హరించిన యపరాధప్రకారంబున, యనలుని మార్గ నిరోధంబుజేసి, మహాభీలంబగు కాలనివాహనాయుధంబు లాక్రమించి, యవక్రంబులైన నిశాచరసైన్య క్రమంబున, విక్రమించి వరుణదేవతాత్మ బలంబడుగంట గలిపి, సమీరుని రజోవికారుం గావించి గుబేరుని నవనిధులు నిజాధీనంబుఁ జేసి, కృత్తివాసు సంబాధంబునుహత్తి జారచోరుల కుపకారంబు గావించి ఘూకంబుల వలన చీకాకుపడు కాకిమూకలకు నాలోకన భీక

రంబై, భల్లూక వరాహానీకంబుల పోల్కి భూచక్రంబు నిండి యాకాశంబున కెక్కి యెక్కడ జూచినం దానయై, యుండెనంత.

సీ. అరులఁ దోలెడి కాల ♦ హరిపతాకాదిక
చ్ఛదసముద్యుతి వోలె ♦ సంజవొడమె
నటమీద గనియు ప్ర ♦ త్యర్థి నిశాట యూ
ధంబు నా గాఢాంధ ♦ తమము బలిసె
నతఁడేయు నుదయ శా ♦ ర్జ్యాముక్త బాణ పుం
ఖముల పోలిక తార ♦ కలు జనించె
తదనంతర ప్రయు ♦ క్తంబునై మిన్నందు
గదనాగ నొప్పెన ♦ క్షత్రవీధి
గీ. అట దివియు ఖడ్గ మనఁదెల్ల ♦ నయ్యె తూర్పు
నందు నేతెంచు చక్రమో ♦ యనఁగ జంద్రుఁ
డుదయమయ్యెను తరువాత ♦ నెత్తువిజయ
శంఖరుచిపోల్కి రేయెండ ♦ జగము నిండె. 94

## చంద్రోదయ వర్ణన

శా. ప్రాచీనాబ్ధి సరోంత రోదయగిరి ♦ గ్రాహోపగూఢోన్మద
ప్రాచుర్యాంత తమఃకరేణ్వ భయదా ♦ ర్థంబచ్యుతుండే యథా
రాచిత్రార్భటు రుక్మితో వెడలు చ ♦ క్రంబోయనన్ రక్తిబెం
పైచంద్రోదయ మయ్యె నయ్యెడను త♦త్ప్రాంతంబులన్ వింతగన్.
మ. తొలుతన్ వెన్నెల మిన్నువాఁకగొని దాదోడ్తోడ వీక్షించి గో
త్రలసద్వీధి జనం దమఃకలిత వేళాకాళికం గారవం
బలరన్ దీర్ఘ శరంబులం బాదివి యాత్మాంకంబునన్ నిల్చి వె
న్నెలరా సోముఁడనంగ సోముఁడు కళంకాంగైక శోభందగన్.

వ. అంత మహానటుని జటాజూటంబు నిర్గమించి సమయ భగీరథ రథమార్గంబు ననర్గళ ప్రవాహంబులతో వచ్చు వియచ్చర స్రోతస్విని ననుసరించుచు, ధరణిపయిన్ వెల్లివిరిసిన పాలవెల్లిచందంబున నందంబై, రేయెండ సాగరంబులపై గొనసాగి, తరువులనరిమురి

పెనకొని. యవనీధరారోహణంబుజేసి, బ్రహ్మాండభాండం బాక్ర
మించి నంత గళావతి యాళీయువతులతోడ. 98

ఉ. వెన్నెలగాయు చందురుఁడు ♦ వేదురుఁజేయుమరుండు బర్హిణుల్
మన్నగనా డుషడ్పదస♦మాజము పాటలపాడ తావులీ
నన్నను గాలిపల్కులు వి♦నన్ శుకపాళియొనర్ప మేడలో
నన్నిలువంగలేక పయనంబయి ♦ క్రొవ్విరిఁ దోటకేగినన్. 99

## కళావతి విరహము

సీ. కడు మొగలాయి ప♦క్కా తరహాదారు
బారైన తమ్మితు ♦ పాకిఁ బూని
మొగలిరేకును గజ♦ముగఁజేసి తప్ప కూ
రకె ఝుమ్మురనుచు మిం♦టికిని నెగసి
క్రమ్మరివచ్చు భృం♦గములను జోడుగుం
డ్ల మరపుహ్వాడి కప్పు♦రమను మందు
రంజకంబుల నించి ♦ లాగైన చిల్కబా
బాడిగ్గి లంఘించి ♦ సజ్జనెలిచి

గీ. డాసి బారొసరించి మీన్ ♦ డాల్వజీరుఁ
డక్క గురిఁజేసివేసి చు♦రుక్క మనుచు
జక్కవల టెక్కునెక్కాడు ♦ చన్నుఁగవకు
నాటుకొని తూఁటువడగ ము♦మ్మాటి కపుడు. 100

ఉ. కంతుఁ డటన్న బోయవిరి ♦ కత్తి ఝురాలనిదూయ బర్హిణుల్
గంతులువేయ వెన్నెలలు ♦ గాయ సమీరుఁడుడాయ తుమ్మెదల్
చెంతల ప్రాయ కోవెలలు ♦ చిందరసేయఁగ నోర్వరాదు ని
శ్చింత వసింప తోట నను ♦ జేర్పఁగ చేడియలార మ్రొక్కెదన్.

వ. అని విరహావేదనాభరంబున తరుణీమణి మోర్వఁజాలక. 102

సీ. విరిసెజ్జబంతి తె♦త్తరమంది నడిలేచు
చలువరా రాతిపై ♦ నిలువఁబోవు

సీ. శరదబ్జవదన నే ♦ చంగ నెంతురే సమ
యమ్మంచు నీలకం ♦ ఠమ్ములార
కన్ను లెఱ్ఱగఁజేయ ♦ గారాదు రామపై
కేరుచు సారె కో ♦ కిలములార!
పలుకాదరింపకా ♦ చిలుకలకొలికిపై
గనలుట మేలా శు ♦ కంబులార!
తలదాల్చు మిమ్ముల ♦ నళివేచ ఝుంఝుం మ
నంగరాదు వినుఁడు ష ♦ డంఘ్రులార!
గీ. తరుణిపై కోపపడకూడ ♦ తగదు మీకు
మైనగోరింకలార ♦ యేమైన గాని
హంసగామిని నులికింప ననువుగాదు
చాలునిఁక బొండు రాజహం ♦ సంబులార! 115

వ. నావుఁ డొక్క చెలికత్తె యిట్లనియె. 117

సీ. చండాలి నారిగా ♦ జనరతిం గూడి యొ
ప్పిన దర్పకుఁడు మఘు ♦ ప్రియుఁడు దెలియ
కాంచనప్రియుఁడన ♦ గా నామని జరించి
యలరించును కుజాత ♦ ములను దలఁప
మహి సుమనోభూతి ♦ ప్రహరింపుచును ప్రభం
జనుఁ డారయఁగ గాలి ♦ యనఁగ సోఁకు
దోషాకరుఁడు గురు ♦ ద్రోహి నిశాచరుం
డతని జూడఁగ కళాగతిని దరుగు
గీ. కలసె పంచమరీతి శి ♦ ఖండి జాతి
వారి నధిపాతకాళి త ♦ త్పరత మీకు
జనదెపుడు మీదు సన్మార్గ ♦ చర్యమాని
యరుగుడో పరభృతోత్సుక ♦ హంసలార! 118

వ. అని యుపాలించిన సమయంబున కుంభినీయానదీనానూనమాన సయ్యె మూర్ఛిల్లి దెలిసి యసురసురనుచు లేచి నలుదిక్కులు రోసి యిట్లనియె. 119

సీ. నేలవేలుపు మిన్న♦జాలంబుఁజేసి యిం
 ద్రప్రస్థపురము గ♦న్నాఁడొ లేదొ
నాపంపునను వచ్చి ♦ నాఁడంచు ప్రభు వాయ
 నకు దర్శనంబిచ్చి ♦ నాఁడొ లేదొ
దర్శనంబిచ్చి యం♦తట సమయంబిచ్చి
 నామాట లాలించి ♦ నాఁడొ లేదొ
నిను నమ్మియున్న దా ♦ నిని వెతపాల్సేత
 న్యాయంబు గాదని ♦ నాఁడొ లేదొ

గీ. ఇంక నేమందు మరునకు ♦ నిదియె సందు
చలువ వెన్నెలకందు ♦ వాసంగు జందు
కలువమెయినుందు ♦ వీనుల కంటివిందు
దిక్కు గలదెందు చెప్పరే ♦ దీనిముందు. 120

వ. అని విచారింపుచున్న సమయంబున. 121

గీ. వచ్చి భూసురుఁ డక్కు[illegible]♦వతిని గాంచి
పోయి వచ్చిన కార్యంబు ♦ కాయొ పండో
యనవ్రుమ నుడించి పంపు పంకడపుచు బల్కి
సకలమును జెప్పె నానుపూర్వకము గాగ. 122

క. దేని నిను వీ[illegible]ని చని
దేవేంద్రసు[illegible]ను సయ్యుర్భిష్మరు గని సం
భావన లంది వి[illegible]ము
గా వినుపించితిని వా[illegible]కము సర్వంబున్. 123

మ. విని సందేశము [illegible]తాన్వయుఁడు స[illegible]వేమారు నగ్గించి పా
వనచారిత్ర [illegible]నురేంద్ర నిమతాంబంకించె నామంచిదే

యనుకూలం బెరిగింపు మంచు పలుమారా బాపురే మేల్బళా
క్షోను మిష్టంబులు వేయునేటికి నివే । కొమ్మిమ్మా నమస్కారముల్.

వ. అని యభినందన పూర్వకంబుగా నన్ను మగుడం బంపించిన
నరుదెంచితి విను మతండు, 125

సీ. హిమబిందువులఁ జెంది । కోమలాంగు కరసిత
నయన పాదాబ్జ బాణములు గూర్చి
సంపెంగనూనె వాసనలు జెన్నలరు వే
నలి యన నలికుల । బలముఁ గూర్చి
బహుళపక్షాప్తి సర్వకళాభియు క్షమా
ముఖచందురు సహాయముగను గూర్చి
ఎక్కుడిగ్గకనె పెంపెక్కు చక్కని యుక్కు
బొమ సింగిణుల జోడు । నమరగూర్చి

గీ. ముజ్జగము గెల్చు ఎలువిద్య । నెజ్జయైన
మదను గెలువంగ డీకొన్న । ముదిత నన్ను
చెదరఁ జేయదె యనుచు సమ్మదముతోడ
సుదతి గొనియాడెనా నవ । మదనమూర్తి 126

వ. అట్లగుటం జేసి 127

ఉ. మానిని ధర్మరాజతని । మాటలు వేదవరంబు లిచ్చెనా
యేనుగపాడి గంటగనె । నేని సమస్త జగజ్జయేందిరా
స్థాన సమాగమంబు సర । దాపడి వ్రేసిన రామబాణమా
హాన్నృపమాత్ముఁడే యదుకు । లోత్తముఁడో హరుఁడో విధాత్రుఁడో

ఆ. జలధులన్ని యింకి । చనెనేని మేరువు
విరిగెనేని భూమి । తిరిగెనేని
గతులు దప్పిరేని । కంజాప్త చంద్రులు
మాటఁదప్పలేరు । మానఘనులు. 129

వ॥ అదిగావున ధర్మనందనుండు నిక్కమ్ముగా స్వయంవరంబున నిన్ను
వరియించు నంతలోనె యని మేలువార్త దెలిపి సుఖంబుండుమని
బ్రాహ్మణుండు నిజమందిరంబునకుం జనియెనంత. 130

## ప్రభాతవర్ణన

శా. మాఱున్ బెన్మధు మత్తురాత్రి చరునిన్ । బ్రాపింప దద్దాగతు
ల్మెరేహంస శుకాళి పారభృత పా । ళీ మీశుభాద్గోద్గతుల్
బారందోచి యటంచు దానిజ భర । ద్వాజ ప్రభావోక్తులం
జేరెన్ నావన సీమ వేకువను దా । ల్చెన్ ఖంజరీట ధ్వనుల్. 131

ఉ. ఆయినుఁడాగతాభిముఖుఁ । డౌటయు దామెఱిగున్న డౌటఁచే
దీయని బంధురార యువ । తిందగు నిల్లదమిన్ రమించిరా
నా యడనేగునో తుదకి । యంచని యాకలకంత కొక్కురో
కోయని వారణోక్తి పలె । గూసె వెసన్ గృకవాకుకాండముల్.

మ. ఇనుఁడన్ రాముఁడుస్వీయరాగ ముదితాం । కిన్ కొల్ల నక్కాంత ప
ద్మినికిన్ గీడగుదుస్తమః కరటి మ । ర్ధించం గరాస్త్రంబ బం
పన దట్టె జనపతీరూఢిదము నె । ప్పంగావు కావుంగదే
యను లీలంబ విభ్రుధ్వనుల్ బాదిసెనా । శాంతంబులన్ వింతగన్.

వ. అంత. 134

మ. మునుకాలాంతముగాగ నిద్రగని । సంమోదంబుతో నబ్జరా
గ నిబద్ధాగ్ర శిరోగృహాగ్ర గతుఁడై । కల్యం మహానిద్ర బొం
దిన విశ్వంబు పునర్భవోత్కమగు జ్ఞ । ప్తికిం జేయ లోఁగోరి చూ
చిన బ్రహ్మేయనమంద రక్తియన బొ । ల్చెన్ హేళిపూర్వాద్రిపై.

## కళావతి స్వయంవరము

వ. తదనంతరం బసంత కాంతుండు కాలోచిత కృత్యంబులు నిర్వర్తించి, యాస్థానమంటపంబున కేగుదెంచుసమయంబున జెలికత్తెల వలన నెఱింగి, తన మనోరమ బలికిన పలుకు లాకర్ణించి సింహాసనాసీనుండై, బుధబాంధవహితామాత్య ప్రభృతుల రావించి యుచితాసనంబులఁ గూర్చుండ నియోగించి శ్రాంతదడవునకు యథోచిత వాక్యంబులతోడ భాషింపుచు. 136

చ॥ తనదు కుమారికామణికి । తగ్గ మనోహరుడైన వల్లభుం
డనఘుఁడు రూపశీలనయ । యౌవన బాంధవ వంశమాది లాం
ఛన ముఖభాగ్య యోగ్యగుణ । సంగతుఁ డెవ్వఁడో కోయటంచు నె
మ్మనమున నూహఁజేసి బుధ । మంత్రిహితాప్తమతంబుగా వెసన్. 137

## స్వయంవరంబునకు రాజన్యులు వచ్చుట

వ. భేరీ మృదంగాది రావంబులతో నఖిల దిక్కుల యందు స్వయం
వరంబు చాటించి శోభనోద్యోగంబు సేయించుచున్నంత. 138

మ. పరమేశాను విలాసధారి సుగుణ వ్యా । పారపారీణుఁ డీ
శ్వర పాదాంబుజ భక్తిలోలుఁడు రిపు । వ్రాతాంతకుం డాశ్రితో
ద్ధరణుం డూర్జిత నీతిశాలి పటుదో । ర్దండాతి సత్వాఢ్యుఁడై
కరమొప్పారఁగ వచ్చె నీలుఁడటకున్ । గాశీశుఁ డుర్వీశ్వరా. 139

మ. అతిసత్వాంచితమా గజాశ్వరథ పాదాత్యాళితో మైథిలీ
పతిచారిత్ర మహోత్సవముల్ బుధహిత । వ్రాతంబుతోఁ జెప్పుచున్
సతమా కోసల భూపధాన నగరీ । సాకేత నాథుండు నా
ఋతుపర్ణుం డరుదెంచె సద్గుణ కళా । హేలాను లీలాగతిన్. 140

సీ. భేరికాధమడమ । త్కారముల్ మీరంగ
గాంధారపతివచ్చె । బంధుయుతిగ
ధ్వజవస్త్ర పటపట । ధ్వానమభ్రము మ్రోయ
వైదర్భుఁ డరుదెంచె । మోదమునను
శుండాల ఘీంకృతి । కాండంబు ఘూర్ణిల్ల
కాళింగుఁ డేతెంచె । హాళితోడ
కంఖాణ రింఖావి । శృంఖల ధ్వనుల బా
హ్లీకుఁ డేగుదెంచె । యుత్సుకము మెరయ

గీ. మఱియు కర్ణాట పానాట । మాళవాంధ్ర
కొంకణావంతి టెంకట । ఘూర్జర కురు
నాట కరహాట దేశాధి । నాథులొక్క
మొగిని వచ్చిరి వైదేహ । నగరమునకు. 141

చ. పొలుపు దలిర్ప వచ్చిరి నభోపతవాతవిధూతకేతనాం
చలములు నైజఖడ్గజిత శాత్రవు లేగుచు చేరుమాళ్ల చే
దోలఁగఁగఁ ద్రోయ సోయగము దోప వియచ్చరదఃస్వరఃకుచాం
చలవిలసద్దుకూలములు జాలఁగఁ ద్రోయఁగ ద్రౌపదుల్ బృహ
ద్బల కుకురాంగ వంగ నరపాలక మద్ర విరాటరాట్సుతుల్. 142

సీ. నవరత్న కర్ణకుండలకాంతి తలమీఁది
మణికిరీటంబుతో మారుమలయ
ఇంగిలీకపుఁగాంతి బంగారు పొంగారు
దుప్పటీ వలెవాటు దొంగలింప
కరముల శంఖ చక్ర గదాసి శార్ఙ్గమ్ము
లరివీరులకు భయంకరము దోప
భేరీ మృదంగ గంభీరఘోషంబు బ్ర
హ్మాండ భాండంబెల్ల నిండుకొనఁగ

గీ. ఆప్తులగు యదు వృష్ణి భోజాంధక కుల
వరులు సాంబాది నిజతనూభవులుఁ గొల్వ
రథముపై నెక్కి మిథిలాపురంబుఁ జేరె
సంభ్రమస్ఫూర్తి గోపాల చక్రవర్తి. 143

చ. జవ తురగాళితో కుధరసన్నిభ భద్రమదావళాళితో
వివిధ రథాళితో చటుల వీర్యసమేత భటాళితో మహా
దివిజ వరాళితో భయ వధీధృతి ఖడ్గకరాళితోడ పాం
డవు లటకేగుదెంచిరి దృఢధ్వజముల్ నభమంది వెల్గఁగన్. 144

క. చనుదెంచిరి మిథిలాపుర
మునకున్ దుర్యోధనుండు మున్నుగ హితబం
ధునికాయముతో కౌరవు
లనఘా చతురంగబలసమన్వితు లగుచున్. 145

క. యాదవ పాండవ కౌరవు
లాదరమున నచ్చిరిట్లు శ్రీ హరి ధర్మజుఁడున్
మోదంబున దుర్యోధనుఁ
డాదిగ నమువఁగ భుజామహత్వము లలరన్. 146

గీ. మఱియు దిగ్దేశముల రాజవరులఁగూడ
మఱియు దిగ్దేశముల రాజవరులు గూడ
వచ్చిరి నృపాలయోగ్య శోభలు వెలుంగ
వచ్చిరి నృపాలయోగ్య శోభలు జెలంగ. 147

వ. ఇట్లు వచ్చిన నరలోకపాలకులు సింహాసనాసీనులై యున్న సుయోధను నుచితాసనాసీనుం జేసి కృష్ణుని మహాసనంబున నుండ నియమించి ధర్మరాజు, 148

మ. వన పుష్పాతి విచిత్రమై మృగమద వ్యాకీర్ణమై చంద్రచం
దనయుక్తంబయి ఘుమ్మనం బాలయు బల్ తావుల్ జలింపన్ గన
త్కనకోద్యన్మణి సానుసానువున ధిక్కారింపఁగా జాలబా
ల్చిన కాలాగరు ధూప సౌరభమణీ సింహాసనం బందునన్. 149

మ. బలుజన్నా జలతారు తాసుజిగి తేవల్లుల్కా లోడెత్తు నా
వల దాపై యొరుగొప్పదీర్చిన హవా బాలీసు జోదంటి చెం
తల బింబాము జగానిగారఁవు జరీ తాజాకి నేరాగబల్
దలు దట్టున్ న్నెరవన్నె మీఱ మెరుగుల్ ధక్కాల్ వగల్ గుల్కఁగన్

మ. హరాయ పైమీరు మితారి రే వెలుఁగురా లోయ్యారపుం బారులో
ప్పుయి పైగోవమెఱుంగు కెంపురవలందం జేర్చిఁ దాపించి బో
దియ దీర్పొప్ప గళాసికీసని జగా తేటల్ గుబాళింప వ
న్నియలన్ మించిన మంచగద్దియపయిన్ న్నిగ్గుల్ దుబాళింపఁగన్.

మ. ననువై మెచ్చు జగానిగారముల మిన్నాచీటునాల్ వన్నె తె
గ్గనినిగ్గుల్ దులకింప నాల్గమమ ఔక్కుం బక్కి రారాపసల్
మినిచందమ్మి కడాని మేలౌరఖుడా ల్మిదం బిసాళింప గ
ప్పిననిద్దాపరుమంచు హరాంబన ఝురీ వెల్గుల్ వజాగుల్కఁగన్.

శా. ఈ రేనన్ భావళించి మించఁగను దా ♦ రెంతేని వింతౌ తమా
శాశీవింతఁగ గద్దెపై పరుషు తా ♦ జాజేసినం జూచి తా
పీఠీవామమునందు గొందరు దొరల్ ♦ వెల్గొంద వైదేహుఁడా
పాఠీనాంకవిలాసరూపునకు జూ ♦ షంజూచి యగ్గద్దెపై. 153

ఉ. బాహుల రాజులందఱును ♦ భారులు దీరిచి గూరుచుండ నా
రాజమృగేంద్ర మప్పుడల ♦ రాజమృగేంద్ర ముఖావఖండవి
భ్రాజితమైన మార్గమున ♦ పర్వత మెక్కెడిలాగు బాగుగా
రాజిలు మెట్లవెంబడిని ♦ రంజిల నెక్కెడి కెక్కె నెక్కఁగన్. 154

ఉ. రాజ కిరీటి కోటిమణి ♦ రాజి ఘృణిప్రకరోల్లసత్పదాం
భోజుఁడు చారుమూర్తి క్రతు ♦ భోజనతేజుఁ డతండు బొల్చె నా
రాజులలోన రత్నరుచి ♦ రాజిత విష్టరమందు నీతఁడే
రాజులరా జయారె భళి ♦ రాయని భూజనులెల్ల మెచ్చఁగన్.

చ. కుసుమసమేత పల్లవిత ♦ కుంజ కదంబ విడంబ బింబిత
ప్రసర చకచ్చకద్యుతి వి ♦ రాజక రాజమణీగణాగ్రధా
త్వ సదృశపూర్వ పర్వతశి ♦ ఖాంతర భాస్కరు లీలలోల రు
గ్లసద నుకీర్ణపర్ణముల ♦ రంజిలు గద్దియనొప్పె నొప్పుగన్. 156

క. సురుచిర మణిగణ కిరణ
స్ఫురదాభరణాంగులైన ♦ భూవరులుం దా
సురతరుల పారిజాతము
కరణిందగె నీదువంశ ♦ కర్తనరేంద్రా. 157

శా. ఆ యుర్వీతలనాథ యూథమున ♦ నుద్యద్భృత్యశోభాయత
శ్రేయోభూతిని తారకాగ్రహ మహా ♦ రుచాళిలోనున్న రా
కాయామిన్యధినాథుఁడో యనఁగ శృం ♦ గారంబుగాబొల్చె కం
ఠే యుష్మత్ప్రథితామహాగ్రజుని కం ♦ ఠేఁ బెద్ద పెద్దైనృపా. 158

మ: అతులాలోలస ధాళధళ్యసితవ ♦ స్త్రాచ్ఛాదితోర్వీధవాం
చిత గేహాంగణసీమ బొల్చిరి నృపుల్ ♦ సింహాసనాసీనులై.

యతిశోభఁ క్షితినాథు జుట్టున విమానారూఢులై వచ్చు దే
వత లా శ్రీపతి పెండ్లి శబ్దిపయి తే♦వఁ నిల్చు నట్లబ్రమై. 159

వ. ఇట్లున్నయెడ. 160

సీ. గంభీర భేరికా ♦ శుంభధ్వనుల్ గంధ
 గంధేభ ఘీంకార ♦ గతులు బెసఁగ
లాస్య వేశ్యానూపు♦రధ్వనుల్ కింకిణీ
 కంకణ క్రేంకృతుల్ ♦ క్వణనమలర
పటహ ఢక్కా మహా♦స్ఫుటరావమానద్ధ
 ధాంధణోద్యన్నినా♦దము నెదుగ
కాహళ శంఖ భాం♦కార రావంబులు
 ప్రభవాగ్ర కీలికా ♦ ఫణితి నెరయ

గీ. విభ్రమిత మందరాచల ♦ దభ్రఘాక
మానదుంగ త్తరంగ ఘు♦మంఘుమార్భ
టీస్ఫురత్క్షీరవారాశి ♦ తేవరావ
మొక్కటై మ్రోసె ఘుమ్మన ♦ నో నరేంద్ర. 161

ఉ. అత్తరి బిత్తరంపు వసు♦ధాధిపభూషణ చాకచక్యపుం
జొత్తులు నత్తటంతులుఁ ♦శోభనకృత్య ఘుమంఘుమంబు లు
వ్వెత్తుగ గర్జులై దగ బ్ర♦వృద్ధ ఘనాగరుగంధధూపము
ద్వృత్తి నకాలమేఘమయి ♦ పెంపున గేకులకిచ్చు మోదముల్.

వ. అట్టి మహోత్సవ సమయంబున కొందఱు కుందరదనలా రాజ
లోకంబు నాలోకించి సన్మాన్యరాజన్య లోకంబునందా సౌజన్య
శేఖరుం గాంచి తదీయ విలాసవిశేషంబు లూహించి, మన సఖీ
రత్నంబు వయోరూపలావణ్య మహిమాతిశయంబులు మాటి
మాటికి వక్కాణించి చొక్కుచుండు నితండె కాబోలునని
తలంచి, ఆచకోరాక్షికి నీ రాకాసుధాకరాకారునకు నీడుజోడయ్యె
నని వితర్కించి, యువతీరత్నంబును బరిహాసంబు సేయుచు,
నాలోకించుచు, వదనేందుబింబంబుల మందహాసచంద్రిక లందందం

జలువాఱ తదీయ మందిరాభిముఖులై తమతమ మంద మరాళ
గమనంబులు సందడింప. 163

క. తొయ్యలు లయ్యెడ క్రొందఱు
సయ్యన నెయ్యమునఁ జేర ♦ జని వెనగొనిరా
వయ్యారిని కుసుమితలత
నయ్యళినీ గణము గవియు ♦ నట్లు నరేంద్రా. 164

వ. ఇట్లు జేరంజని యందొక సుందరాంగి ముఖంబున మందహాసంబు
గదుర పరిహాసంబుగా నిట్లనియె. 165

గీ. ఓ కళావతిరో యిప్డు ♦ డొక్క దొడ్డ
రాజు నిను గూడి మిన్నంది ♦ రమ్యఫణితి
కువలయానందము గణింపఁ ♦ గోరియుండె
లోకమున నాత్మసాహిత్య ♦ రూఢి మెరయ. 166

వ. మఱియు. 167

గీ. ఇది వినుము కొమ్మకోరె నీ ♦ హృదయభవగు
ళుచ్ఛగంధ విభాప్తి వె ♦ ల్గుచు ద్విరేభ
రాజరత్నంబు కాంచనో ♦ ద్భయత మెరయఁ
దలఁచి యొకటున్నదని పల్క ♦ చెలియొకర్తు. 168

గీ. ఓలతాతన్వి నీ యందు ♦ నెక్కసౌఖ్య
ఫలము నొక రాజకీరంబు ♦ బడయఁదలచె
రాజయోగాసనమున స్థై ♦ ర్యతను రామ
కృష్ణ సదభిక్ష్యభజన చూ ♦ ట్కకిఁ బ్రియముగ. 169

వ. ఇట్లనుచు ననేక ప్రకారంబుల నక్కీరవాణిని గీరడంబు లాడుచు,
యారాజాస్యలిఁక నాలస్యంబుసేయందగదని రయంబున నభ్యంగన
స్నాన మాచరించి, దడియార్చి, చిక్కకేర్చి మెఱుంగు ధూపంబు
లొదవఁజేసి, దువ్వి మడమల పయింబడి దుమికి, యాముజడ వేసి
వాలుఁగన్నులకుం గాటుకం గూర్చి, భ్రూమధ్యంబున గస్తూరి

రేఖుఁదీర్చి, వన్నెలజిగిపు మేలుతాబంపుఁగాను కయిం బిగియించి మెయిహారంగులం దురంగలించుచుండు కుసుంబారంగు ఝరీ చరంగుల చీరెంగట్టి సిబ్బెపు గబ్బిగుబ్బలం గినె రాట్టుముఁదొట్టు కుట్టు జరీబుటేదారు నీలికంచెలందొడిఁగి, నిద్దంబగు ముద్దుచెక్కుల కాశ్మీర కర్పూర మకరికాపత్త్రంబులు చిత్రంబుగాదిద్ది, కూర్పరం బులదాక ముంజేతుల పాటీ రాగరుసారంబుల రేఖలుగా బూసి మఱియును. 170

సీ. చెలువైన వీర మ ♦ ద్దెలుగిల్కు మట్టెలు
గొనఖుంబరిని కాయ ♦ లును మెఱుంగు
పిల్లాళ్లు మెఱుఁగు బా ♦ ర్లళ్ళు చిటికెన బొద్దు
కళుకుల మ్రోతలం ♦ దెలును పాము
జేబీలు గొలుసులు ♦ చికిలీ కడెంబులు
గజ్జలు పావడాల్ ♦ గరుడపచ్చ
లొదలిన గంటల ♦ యొడ్డాణ మిర్కు క
మ్మర్పటాల్ జాలుల ♦ మర్పగోవ
గీ. మెఱుఁగు టొడ్డాణమును జగా ♦ మేల్మిఁదావు
చుట్టు ముద్దుఁటుంగరములు ♦ జోడుబటువు
లును మనేలానవగ్రహాల్ ♦ పెనుతొలిమగ
రాబిరుదు పొంచి ముద్రికల్ ♦ రహిఁ జెలంగ. 171

సీ. నిద్దాహెూరంగు వ ♦ న్నియ తళ్కువజ్రంబు
గరుజు పోంచీలుచే ♦ కట్టు సరిపె
ణీల్మురవ్వలును మేల్మి ♦ నిగ్గు పచలకీల్కు
డెమలీవలావల ♦ కొపురుఁదాపు
నీలాల గాజుల ♦ నెన్నుడి గల్గు కెం
పుల జిల్కు కంకణం ♦ బులు మెఱుంగు
జాళువా పట్టెలు ♦ జతగుల్కు మగరాలు
బాజుల రాపక్కి ♦ పచ్చలిడిన

గీ. కుందనంపు దండగడియముల్ ♦ గోవకెంపు
రవలు చెక్కిన యసరంజి ♦ ప్రతిమరీవి
పనిమానేలాజగాబాజు ♦ బందు లదరి
దళ్కు సందిట దండలు ♦ తాయెతులును. 172

సీ. గాముల వెల్గు చో ♦ క్కపురెట్టిరంగుల
ము త్తిగరతనముల్ ♦ హ త్తిమేల్మి
పోఁజక్కడపువన్నె ♦ భుజకీర్తు లలఁతి ప
చ్చలకు త్తిగంట్లుతో ♦ ల్జాతి పేట
మగరా కళాసికీ ♦ సొగసు తాజాపని
గల్లా పటాతేట ♦ గాటమైన
యాణిపట్టెడయు కడాని ♦ గుళ్లును బేస
రపుకాశికపు గు త్తి ♦ రాళ్లకట్లు

గీ. గోధుమలకంటె దంటాల ♦ గుళ్లు మోహ
నాల వరహాలపేర్లు చీ ♦ నా గొలుసులు
చంద్రహారంబులుం గిల్క ♦ సరులుపల్క
సరులు చిల్కల తాళీలు ♦ జాజి సరులు. 173

సీ. నక్షత్ర దామముల్ ♦ నవరత్న మాలికల్
తారహారములు ని ♦ ద్దాహెబారంగు
నెలవంక తాళీలు ♦ నెటి బులాకీ పత
కములు తోరంపు ము ♦ త్తెములసొంపు
జాల్నించు కెంపురా ♦ చంపఖల్లీలు బే
సరి కమ్మినీలంపు ♦ టొరవుముత్తె
ములు తనాచీనత్తు ♦ తెలితేటమగరాజు
లాకీజగా యప ♦ రంజి పొంజు

గీ. గమ్మలును పచ్చనీలాల ♦ చిమ్మటాలు
బావిలీల్కెంపు బొగడలు ♦ కీవి మణులు

జిలుఁగు బిందీలు పాపిట • చేర్లు తెలుపు
బాలుపు దులికించు చేర్చుక్క • బొట్టుతోడ. 174

సీ. తోరమా ముత్యాల • పేరుల గిరికొని
జతగుల్కు నెలవంక • బిందుపద్మ
రాగసంఘటితమా • రాగిడీ శశిపువ్వ
చంపగోలుసులు కెంపు • సొంపునింపు
జేజే వజీరురా • చెక్కడఁపుం బచ్చ
టీకైన గేదంగి • రేకువిరుల
గ్రాలు ఖద్యోతంబు • జాలునా వేణితో
బోలు మేల్మిక డాసి • డాలుకీలు

గీ. జడయు మొదలైన నవమణి • స్థగితమైన
చొక్కమా తరహాదారు • సొమ్ములమరు
లొక్కవారంపు తొడుగింతు • లొదవదొడిగి
రెనసి నఖశిఖపర్యంత • మునను జెలికి. 175

వ. ఇట్లు పంకేజవదన లా యేణాంకవదనకు సమస్తాలంకారంబు
లలంకరించి, 176

గీ. అతివకును హారరత్న మ • హావిశేష
భూషణలుదాల్చి యల శివా • స్ఫూర్తి మెఱయు
పగఁ జెలఁగవచ్చు మరునకు • బెగడుదగులఁ
దగ నొసల కుంకుమిడిరి • నేత్రరుచి బొదల. 177

సీ. పస్నుట తేఁట సం • పంగి పూఁదోఁట ర
త్నంపు లేమోక కుం • దనఁపు ననుశ
లాక కడాని చి • త్రఁపుఁబొమ్మ ముద్దుల
గుమ్మ చక్కఁదనాల • కుప్ప కప్పు
రఁపుఁదిప్ప మరుని ని • ద్దఁపుదంతి రతిచేతి
చామంతిబంతి బ • చ్చువిలుకాని

చేకటారి మిటారి ॥ కోకిలవాణి భ
    వ్యశ్రోణి నవమంద ॥ హాస కఠిన
గీ. ఘన కుచ వికాసభాస పం ॥ కరుహనేత్ర
అతిమనోహరగాత్రి గు ॥ ణాభిరామ
రామ యీ భామ భూమి మె ॥ లంగుచున్న
మోహినీదేవియో యన ॥ మురువుఁజూపె. 178

## కళావతి యుమాపూజ సేయుట

వ. ఇత్తెఱంగున నయ్యంగనా లలామంబు తన యంగ శృంగార భావం
బున కుడ్యసంగతోత్తుంగ దర్పణంబుల నపాంగంబుల నవలోకించి
యంతరంగంబునగల యభిలాషసిద్ధి జగన్మంగళప్రదాయి యగు
సర్వమంగళ వలనగాని కాదని యూహించి, తదీయపాద కమలం
బులు హృదయంబునఁ గీలించి యిటని నుతించె. 179

ఉ. వందనమే నొనర్తు హిమ ॥ వద్ధరణీధర రాజపుత్రికిన్
చందురు శేఖరార్ధతను ॥ సంగత కోమలనీల గాత్రి కా
నందకృదాత్మ పాదభజ ॥ నాలసమానసదాస మండలా
మందశుభప్రదాత్రికిని స ॥ మస్తవిభూతి వితాన ధాత్రికిన్. 180

సీ. వందనంబఖిలదే ॥ వనితంబినీయుల
    కాంక కుంకుమ శోభి ॥ తాంఘ్రియుగకు
వందనం బనిశ వి ॥ శ్వచరాచరావ నా
    ధ్యత్యానుకంపా క ॥ టాక్షయుతికి
వందనం బుపనిష ॥ ద్బృందోప వనపాళి
    కాకేళికా నిల ॥ కంఠికిపుడు
వందనంబోంకార ॥ వరరత్న పంజరాం
    తర నిరంతర ముదా ॥ దరణశుకికి
గీ. యనుచునే ప్రొద్దునీకు వం ॥ దన మొనర్తు
కరుణతో మించి యెదుట సా ॥ క్షాత్కరించి

నాదు కోర్కెలు సమకూర్చి । నయ మొనర్చి
గావుమో తల్లి త్రిభువన । కల్పవల్లి. 181

మ. నిను బూజింపని వారి కెంతయును శోభా । స్వాతత్వముల్ గల్గ నే
ర్చునె యెంతెంత తపంబు । జేసినను ముల్లోకంబులన్ భారతీ
వనజాగారలకైన నీదుమహిమల్ । వర్ణింపనౌనే జగ
జ్జననీ పుణ్యఘనీ కృపామల సుధా । సారాగ్ర వీచీధునీ. 182

కం. వాణీ రాముల చెలువగు
ర్వాణీమణులాడిగముల । వనితలు నిను శ
ర్వాణీ నుతిసేయంగ పిక
వాణీ మావంటి కేల । వాణుల వశమే. 183

వ. అని యిట్లనేక ప్రకారంబులం బ్రార్థించిన యాజగదంబ యా నితంబినీ రత్నంబు వినయంబునకు సంతసిల్లి దీని మనంబునం గల యభిలాష దీర్చి సంతోషం బొనర్చెదనని యుషశ్శ్రుతి దేవతలం బిలిచి, నీవు మదీయరూపంబు దీపింప మిథిలాపాలక బాలిక పాలికిం బోయి తదీయాభిలాషంబు విశేషంబుగా నొనర్చి రమ్మని, పొమ్మనిన, యదియును, సాక్షాద్వాగ్దేవీయనో రూపంబున బ్రత్యక్షమై నిలిచినం, దదీయ పాదపద్మంబుల కభివందనంబు లామోదంబునం జేసి, ముకుళిత కరారవిందయై యెదుట నిలచినంగని యయ్యిందువదన నీ డెందంబునం గల చందంబునకు నానందంబునొందితి నీ యిచ్చవచ్చిన వాని నేర్పరించి వరించెదుగాని రమ్మని కేలు కేలం గీలించి సఖీజనంబులు చుట్టురాగ నారాజ మండలాహ్లాదకారిణి యగు నా కళావతిని తత్పిత్రాజ్ఞను స్వయంవర స్థాన సింహాసనస్థ రాజన్యమండల మధ్యమార్గంబునం బ్రవేశంబు చేయించిన నాలోలాక్షిం జూచి యవ్వసుంధరాపురందరులు విస్మయానందంబులు డెందంబున గ్రందుకొనుచుండ. 184

సీ. ఆ ముద్దు గుల్కెనె । మోమును నాలేనును
నగవునా నెరిక్రొవ్వు । సొగసునాజు

గా నిగారంబు చ ♦ క్కని చెక్కులందము
నాజిగిగుబ్బలు సో ♦ యగఁపుగుబ్బ
గుత్తుల కెక్కు నా ♦ బిత్తరి మాటలు
మురిపెంపు నా పెలపు ♦ మోదికెంపు
నాజారుపైటయొ ♦ య్యారము నా వాలు
కన్నులఁ బెళ్కు నా ♦ గానులేమి

గీ. యామిసిమిమేని నవకము ♦ యా చొకాట
నుగునడకవగ యా చెలు ♦ వహహా దలఁచు
కొనిన యుల్లంబు ఝల్లు ఝ ♦ ల్లనును దీని
సొగసునకు సీడు లేదు ము ♦ జ్జగములందు. 185

సీ. బాగు చక్కదనంబు ♦ వహవా చొకాటంబు
మేలునుం జెక్కులు ♦ కాను భళి భ
లీముద్దు నెమ్మోము ♦ లేగుల్కు నగవహొహొ
మురిపెంపు మాటల ♦ మురువు తేట
సేబాసు బలుజగా ♦ జిగిమేను మిసిమిమ
ఝుర్వారెపిరుందునుం ♦ డీరుబాపు
రే కాను హొయల యా ♦ రేరాకడయొ యార
మహహా మిటారిసో ♦ యగపుఁబెళ్కు

గీ. బలురతుల వేడుకలనూని ♦ యలసి దీని
పొగురు గుబ్బలపై వ్రాలి ♦ బిగువు నిండ
కౌగిఁట వసించు వానిదే ♦ గదరభాగ్య
మరయఁగా మోడి పీడి యీ ♦ యతివఁగూడి. 186

## మాయాగౌరి కళావతికి రాజుల వేర్వేఱ గనబరచుట

వ. అని తర్కింపుచున్న సమయంబున నద్దేవి ఆ నరదేవ కుమార రత్నంబుతో పురస్థాన సింహాసనస్థుండైన రాజన్యునిం జూపి యిట్లనియె. 187

సీ. రఘువంశమున దాశ ♦ రథి యని యుదయించి
యజ్ఞంబుఁ గాచి య ♦ హల్యఁ బ్రోచి
మిా మైథిలి వరించి ♦ రాము గర్వ మడంచి
రాజ్యంబు విడనాడి ♦ రమణిఁ గూడి
తాను తమ్ముఁడు వన ♦ స్థలిఁ జేరి పిత్రాజ్ఞ
శరణుజొచ్చిన వాయ ♦ సమును గాచి
ఖరదూషణాది రా ♦ క్షసులను ఖండించి
వనితఁ గోల్పడి కబం ♦ ధుని వధించి
గీ. సూర్య సుతుఁ గూడి వాసవ ♦ సూతిఁ జంపి
1వాయుసుతుచేత భూపుత్రి ♦ వార్తదెలిసి
2తరుచరులతోడ శరధి బం ♦ ధన మొనర్చి
బెగ్గిలగు జుట్టులంకకు ♦ లగ్గవట్టి. 188

చ. వరభుజవిక్రమాక్రమిత ♦ వాసవ సంవద ఖండ సం స్త్రి కం
ధరపటుకంధరత్పట ద ♦ న్గల మార్గణుఁడైన ంక్తి సం
హరహరిదశ్వవంశ కల ♦ శాంబుధి హరదపూర్ణ సోమునిఁ
బరమగుణాభిరాము భవ ♦ బంధ విరాముని రాము వింటివే 189

ఉ. ఆతని పూతవంశజున ♦ హార్యశిజేయు భుజాబలైకని
ఘాత పటిష్ఠ నిష్ఠుర వి ♦ రోధి పరాక్రమ సైన్య జన్య వి
ఖ్యాతచరిత్రు బాంధవ హి ♦ తాంబుజ భానుఁ సూ. చారు శో
భాతరజాయమాను బుతు ♦ పర్ణునిఁ గంటె కురంగలోచనా. 190

శా. వాతోద్ధూత తరంగమానస సరో ♦ భచ్ఛాత ంజాత ధూ
ళీతారుణ్య సుగంధ నీరసవయుం ♦ గ్రీడావగాహైక ది
ష్టా తాత్పర్యముగల్గెనేని త్రయిలో ♦ క ప్రస్తుతాచారు సా
కేతా ధీశ్వరు గోరు మిా చకితపం ♦ కేజాత పత్రేక్షణా. 191

గీ. అని యిటులఁ జెప్ప నతని వం ♦ శావతార
మంత యాలించి గాంచి య ♦ క్కాంత యతని

(1) వాతజుని (2) వనచరుల = పాఠాంతరములు.

కంజలి యొనర్చిన నెఱింగి ♦ యవల వేఱు
వేర నిట్లని పల్కె నా ♦ కీరవాణి. 192

సీ. స్వర్గభోగాప్తిన ♦ నర్గళుం డీతఁడీ
రాజేంద్రుఁ జూడుమో రాజకన్య
సమవర్తి యగుచు పూ ♦ జ్యతగాంచు నీ దండ
ధరుని వీక్షించుమో ♦ తరళనయన
రత్నాకరముల ♦ పాలనఁ జేయు నీమహా
ప్రభుని గన్గొను మహా ♦ ప్రభు కుమారి
సర్వజ్ఞహితుఁడు శ ♦ శ్వచ్ఛ్రీంద్రుఁడీ రాజ
రాజునీక్షించుమో ♦ రాజవదన

గీ. అనుచు నృపవేషములుదాల్చి ♦ యచటనున్న
యింద్ర హరి పాశి ధనదాదు ♦ లెందఱేని
దేవతల నెంచి చెప్పుచు ♦ దేవ నితని
యెఱుఁగ వారికిఁ బ్రణమిల్లి ♦ యరుగుమనిన. 193

వ. అట్లుగావించి వారల నతిక్రమించి, అవలవసియించియున్న మండలేంద్రుల సమీపించియున్న నమ్మించుఁ బోణితో నద్దివ్యాంగన యిట్లనియె. 194

శా. దేవవ్రాత హితుల్ సమస్త పరిపం ♦ థివ్రాత విక్షేప దీ
క్షావంతుల్ నయవంతు లూర్జితులు దృ ♦ ష్టశ్వేతకేతుల్ ధనుః
ప్రావీణ్యుల్ ఘన పుణ్యులిద్దఱును భా ♦ స్వచ్చంద్ర సాంద్రద్యుతుల్
శ్రీవిఖ్యాతినిల్చిరి కోమలీయెదుట గం ♦ టే చేది భూమీశులన్ 195

గీ. పద్మినీకుముదినుల హ ♦ ర్పతి నిశాప
తుల కరముబట్టి యనుపమా ♦ ద్భుతవికాస
ములఁజెలఁగు లాగు నీనరేం ♦ ద్రులనుఁగూడి
యుండ మనసైన వరియింపు ♦ మో లతాంగి. 196

వ. అని చెప్పినవిని యూరకున్న రాజకుమారికను మనస్కారంబుగామిఁ దెలసి 197

గీ. అద్రివిజమాన్య యక్కన్య ♦ నన్నృపుని
సన్నిధిని జేర్చియనె మాన ♦ సంబునందు
గాలినుత్పన్నమైన భం ♦ గములజాలు
రాజహంసిని పద్మాంత ♦ రంబువోలె. 198

ఉ. బంధుర శా( సిద్ధమగు ♦ పద్ధతులన్ దెలిపెన్ నటించిగ
ర్వాంధ విరోధి తూలహతి ♦ యందు ఖలీనలసన్మరున్మహా
గంధగతిం జరింపుచు జ ♦ గంబుల వన్నెకు నెక్కుచుండు నీ
సైంధవ శేఖరున్ గనుము ♦ చారుమృగీచకితావలోకనా॥ 199

సీ. గాంధర్వ శారీర ♦ కలన నొందుటఁజేసి
దైవత స్వరయోగ్య ♦ తనువహించె
శాస్త్రవిద్వద్విశి ♦ ష్టానీతిఁబడఁజేసి
దారాల సద్గతిం ♦ దనిసి మెలఁగె
అఖిలాశ్వ ముఖలక్ష ♦ ణాద్యశుం డగుటచే
భూపాల సేవ్యాను ♦ భూతిమెరసె
వామపార్శ్వముల నె ♦ ప్పటికి నారయుటచే
తలవంచి బాహ్యా వ ♦ ర్తనలు మానె
గీ. రహితదుర్దోష పంచక ♦ ల్యాణ సహిత
సైంధవాన్వయ దీప్త వ ♦ జ్రంబు వీని
చరిత మిది వాంఛయానె వి ♦ స్ఫురిత ముకుర
తాళితాస్య కపోల శో ♦ భాలవాల. 200

వ. అని పలుకు పరిహాస చాటూక్తులకు దరహాసంబు మెఱయ నిషధ సూయాకుటిలయైన యక్కుటిలకుంతలను తత్ప్రాంతరాజ సన్నికటంబుఁజేర్చి యుద్దివ్య మానినీరత్నం బిట్లులనియె. 201

మ. నగరాట్కూట విటంక నిర్ఝర ఝరీ ♦ నాళీకపాళీరజో
గగనాంతాంకిత దేవదారు తరుషో ♦ కక్షీర విస్ఫార సా
రగ గండస్థల పాలసౌరభ సమీ ♦ ర వ్రాతమున్ గోరితే
భగదత్తున్ వరియింపు మింపున సఖీ ♦ ప్రాగ్జ్యోతిషాధీశ్వరున్ 202

మ. హిమవద్గోత్ర విహారకిన్నర వధూకిం ♦ ధూళినాకర్ణన
ప్రమదాత్మాగతశాతచేల వనమా ♦ లాలోల చేలాంచలో
ద్గమ సౌరభ్య సమీరణుఁ బాలయ సౌ ♦ ఖ్య క్రీడనందాడ నో
రమణీ వేడుకయైనవీసి గొనుమీ ♦ లాలిత్య హేలాగతిఁ 203

గీ. అనిన పల్కులువిని తార ♦ కాధినాథు
నందున మనస్కరించని ♦ యాబ్జపి వి
ధమున నున్నట్టి యీ మం ♦ దగమన నన్య
నృపుని సన్నిధిజేర్చి ♦ యా నెలఁత బలికె. 204

శా. బంధుప్రక్రియ నాత్మపక్షులను శో ♦ భావృద్ధులం జేసి గ
ర్వాంధవ్రాతము దోలు నీకువలయా ♦ త్యానందసంధాయి స
ద్బంధుం జారుశుభానురాగు మహిమో ♦ త్కృష్టాత్మభావుం జరా
సంధుం జూడుము వేడుకైనమదిలో ♦ చంచత్సుభాలోచనా. 205

గీ. నావుఁ డాతనిఁ జూచి మ ♦ నస్కరింప
కన్య రాజన్యుఁ జేరఁగా ♦ నరిగె యువతి
కడలఁ జేరంగఁజనెడు గం ♦ గాఝరియును
దారినుండెడు కుధరంబు ♦ దాటునట్టు. 206

వ. ఇట్లరిగిన నవ్వధూరత్నంబునకు నద్దివిజాంగన నీలునుం జూపి యిట్లనియె. 207

గీ. మదనుని జయించు నవలోక ♦ మాత్రచేత
కాపురము తారహేమదు ♦ ర్గములు దలఁప
నతులిత విభూతి కలదు కా ♦ న్యధిపతియగు
రాజమాళిని మనసైన ♦ రమణిఁ గనుము. 208

వ. అనిన విని యా కళావతి నీలుని వరింప రుచింపక కనుసన్న నతిక్రమింపనుని చెప్పుచున్న యన్నిలింప వనిత సవిధప్రదేశవర్తియైన దుర్యోధనుం జూపి యిట్లనియె. 209

శా. శ్రీకంఠప్రతిమాన దార్ఢ్యబలదోః ♦ క్రీడా ధనుర్గాఢ వి
ద్యాకౌశల్యుఁ డనేక ధర్మనయశా ♦ స్త్రగ్రంథ సిద్ధార్థ మే
ధాకల్పేతరుఁ డుత్సమిజ్జ యనుధాం ♦ ధప్రీతిదుండైన య
స్తోకప్రాభవుఁ గౌరవేంద్రుఁ గనుమీ ♦ దుర్యోధనున్ మైథిలీ. 210

గీ. రాజ దంతావళాగ్ర యూ ♦ ర్థ్యము లిడి రుచిర
నఖర మహిమాప్తిఁ భూరిభా ♦ స్యఖిల దుర్గ
చారిగా నొప్పు రాజకం ♦ ఠీరవుండు
గోరుమీతని నవమృగీ ♦ చారునయన. 211

వ. అనిన నాలించి తదీయ గాంభీర్య తేజో వైభవంబులకు నాశ్చర్య
మగ్న మానసయై, నదియునుంబోలె తలయూచుచు నయ్యంతి
కరంబుబట్టి 212

కం. చాంపేయామోదమును స
హింపక సారంగకలిత ♦ హేలాగతినై
లింప తరువరమునకుఁ జను
సొంపున నేతెంచె ధర్మ ♦ జుని సన్నిధికిన్. 213

వ. ఇవ్విధంబున నిల్చియున్న నవ్విలాసినీరత్నంబుతో నవ్వేలుపుటింతి
యిట్లనియె. 214

## కళావతి ధర్మరాజును వరించుట

చం. నలుఁడను చక్రవర్తి తన ♦ నామముఁ గోరి పఠించువారికిన్
గలికలుషంబు లన్నణఁపఁ ♦ గా శపథించి స్వయంవరంబునన్
నలరుచు వేట్కభైమి దమ ♦ యంతివరించెను వింటిగాదె పూ
ర్వులన గణించె మున్నుగపు ♦ రూరవ చక్రధరుండ పార్వతిన్. 215

కం. ఉశనస్సంభవ రాకా
శశిముఖ యను దేవయాన ♦ స్వాధిష్ట మహా
దశ వరియించె యయాతిని
బ్రశంసజేయ నతఁడితని ♦ వంశ్యుఁడు గాఁడే. 216

కం. పూరుకురు రాజ భరతులు
పౌరవులన కౌరవులన ♦ భారతులనగా
పేరువహించిరి వినఁదగు
వారిని మునువింటి గాదె ♦ వారల మహిమల్. 217

ఆ. వె. అట్టిచంద్రమాన్వ ❘ యంబున జన్మించి
ప్రబలినట్టి పాండు ❘ రాజునకును
తనయు లైదుగురు పృ ❘ థామాత్రులందున
గలిగి రందు నగ్ర ❘ గణ్యుఁడితఁడు. 218

సీ. మహిమ మీరఁగ సుధ ♦ ర్మామధ్య పీఠికా
సీనుఁడయిన సునా ♦ సీరు వోల్కి
సనకాది మునిలోక ♦ సార్వభౌములతోడ
యజ్ఞంబు పైనున్న ♦ యజునిబోల్కి
క్షీర వారాశిలో మీ ♦ ఱిన శేష ప
ర్యంకంబుపైనున్న ♦ హరివిధమున
కైలాస భూధరా ♦ గ్రమున దీప్యద్విష్ట
రంబున నున్న చం ♦ ద్రధరు తేవ
గీ. భూవరేణ్యుల మధ్య న ♦ ద్భుత మహాత్వ
చారుశోభావిభూతిచే ♦ మీర యెదుట
విష్టరంబందు నున్న య ♦ వ్విబుధ వంద్య
క్రేవగను కుందరదన పం ♦ కేజవదన. 219

సీ. ఈ రాజు వైరిని ❘ ర్వారణవారణ
వారంబునకును కం ❘ ఠీరవంబు
ఈ రాజు సంతతా ❘ శారదాశ్రితజన
కీరమండలికిని మం ❘ దార తరువు
ఈ రాజు బాంధవాం ❘ భోరాశికిని మోద
కారణంబైన నీ ❘ హార కరుఁడు

ఈ రాజు బహుదిన • దారిద్ర్య ఘోరాంధ
కారంబునకు గ్రీష్మ • సారసాప్తుఁ
గీ. డనుచు లోకంబులెల్ల ద • న్నభినుతింప
నెగడె శాశ్వత కీర్తిన • నేక విబుధ
మాన్య మాంగళ్య సుగుణసం • పత్ప్రపూర్తి
సాధుపథవర్తి యీ • రాజ చక్రవర్తి. 220

సీ. సద్గుణంబులు గూడి • సంచరించుటచేత
ఘనత సర్వజ్ఞ శే • ఖరతఁ గాంచె
శాత్రవచక్ర శ • శ్వద్విభూతి కరుఁడౌట
పంకజాత విహార • ఫణితిఁ గాంచె
శుచిమీరి మిన్నంది • శోభనుం డగుటఁ జేసి
ద్విజరాజ రూఢిమై • దేజరిల్లె
కువలయానందభి • నవరసజ్ఞుండౌట
సరస సంపత్కళా • గరిమఁ గాంచె
గీ. రహిఁ జెలంగెడి చల్లని • రాజ యారె
జను లితండనఁ గాఁదగె • సాధుధర్మ
జాతుఁడీతనిఁ గోరఁగా • జనుశుభాను
కీర్ణలావణ్య సదన పం • కేజవదన. 221

వ. అని బహుప్రకారంబుల నతని మహిమాతిశయంబుల నెఱింగించి భవదీయ రూపరేఖావిలాసంబునకుం దగిన వరుండితని నవశ్యంబు వరియింపుమన నంతలోన 222

కం. ఇటునటుఁ జూపి మగుంపు
త్కుట వేగముతోడ నిక్షు • ధనువుంగొని యా
కుటిలవికచా ప్రభువుల హృ
త్పుటముల గాడంగనేసె • పుష్పాస్త్రములన్ 223

వ. తత్సమయంబున బరవశయగుచు మరలఁ దెలివింగొని, మున్ను నారదవాక్యంబుల వినుటంజేసి యత్యంత ప్రేమానుబంధురుఁడైన

విభుడతండు గదా యని మనంబున నూహింపుచు, మోహ సంభ్రమంబు బెనఁగొనఁ దరహాసంబుగదుర కించిల్లజ్జావనత వదనయై పుష్పధామంబు చేఁబూని సంశయింపుచున్న యక్కన్నియ చేతులు బట్టి యన్నిర్జర వధూరత్నంబతని కంఠలగ్నంబు సేయుమని పల్కిన నయ్యువతి యాధర్మజుని కంఠపీఠంబున కుసుమధామంబు నిలిపి నమస్కరించి నిలిచిన, దత్సమీపంబున నున్న కృష్ణదేవునకు మ్రొక్కించి మరలించి, తదీయభవ్య మందిర ప్రవేశంబుఁ జేయించి యద్దివ్యాంగనాతిలకం బక్కన్నియ నాశీర్వదించి, తదీయాభివందనంబులు గైకొని యంతర్హితయయ్యె, నవ్వల రాజేంద్రలోకంబు రోషంబులఁ దమతమ విడిదియులంకుజనియెనని చెప్పిన యవ్వలి వృత్తాంతంబులెట్లని జనమేజయుండు వైశంపాయను నడుగుటయు. 224

—* ఆశ్వాశాంతము *—

మ. నృపపూజాంచిత యుజ్జయాంకతను కాం♦తి మ్యాన మీనాంక స
త్తపనీయాచల ధీరసత్కవినుతా ♦ ధారాయశస్సార కా
ధిపనీహార తుషారశైలరజితా ♦ ద్రిశ్రేష్ఠ సంతానపా
దపపాటీర శతారహార శరకుం ♦ దస్ఫూర్తి విభ్రాజితా 225

క. వితరణ రాధేయాయా
ర్జితసేవా ముదితకౌస ♦ లేయా సారాం
చిత బాహులేయ వినయా
న్వితమతి గాంగేయరూప ♦ విజితాత్రేయా. 226

— మాలినీ వృత్తము —

వెలిచెటి కులదీపా! విక్రమాం ♦ చద్దిలీపా!
నలిన నయనసేవా! నర్ఘ్యమేధానుభావా!
సలలిత గుణగేయా! ♦ సాధు విద్వద్విధేయా!
నలరిపు నిభకీర్తి! ♦ నవ్యమాంగళ్య కీర్తి! 227

## గద్యము

ఇది శ్రీ శివరామేశ్వరానుగ్రహపాత్ర భారద్వాజసగోత్ర
పవిత్ర కాళ్లకూరి సూరకవి పుత్ర కించిదాంధ్ర
కవితా విధేయ గౌరీకాంత నామధేయ
ప్రణీతంబైన ధర్మనందన విలాసం
బను మహాప్రబంధమున
ద్వితీయాశ్వాసము.
శ్రీ శివరామేశ్వరార్పణమస్తు.



శ్రీరస్తు — శుభమస్తు

# ధర్మనందన విలాసము

## తృతీయాశ్వాసము

కం. శ్రీ విద్వత్కవి జీవం
జీవ కళాత్రేయ సకల ✧ చేతనరక్షా
వ్యావృత్తాత్రేయ మహా
శ్ర్చేయాంచిత పుణ్యకాయ ✧ శ్రీగురురాయా. 1

వ. అవధరింపుము జనమేజయునకు వైశంపాయనుం డిట్లనియె, నట్లు స్వయంవర లబ్ధయైన గళావతిని గులాచారానుసారంబుగా విచారించి శ్రీనారాయణాజ్ఞ ప్రకారంబున సురాపగాకుమార ప్రముఖ నిఖిల కౌరవులు కృపద్రోణాచార్యాదుల యనుమతి వడసి. 2

చ. తనదు పురోహితద్విజులు ✧ ధౌమ్యుడు మున్నగువారిఁ బంచినన్
జని జనకావనీశ్వరుని ✧ సన్నిధికేగి నరేంద్రమాపృథా
తనయునకున్ భవత్సుత ను ✧ దారతఁ బెండిలిసేయఁగాఁ దలం
చి నళిననాభునాజ్ఞ తను ✧ జేసి నదీతనయాది కౌరవుల్. 3

కం. మము బంచిన వచ్చితి మిదె
మిముగాంచితి మిష్టసిద్ధి ✧ మేలొదవెను నీ
కౌమరిత నొసంగితని సం
భ్రమమున మము బంపఁదగిన ✧ బహుమతు లొదవున్. 4

ఉ. నావుఁడు ధర్మరాజునకు ✧ నా సుత నియ్యఁగఁగంటి నేటితో
పావనమయ్యె మత్కులము ✧ భాగ్యముగంటిమి నేను బంధులున్
దైవికమా యదృష్టముగ ✧ దా యుభయత్రకు మీరె పూజితు
ల్గావున నిర్ణయించి శుభ ✧ లగ్నము, పెండ్లికిఁ దర్లిరమ్మనన్. 5

## ధర్మరాజు వివాహమహోత్సవము

కం. అందఱు సంతోషించిరి
యంది బహూపథలవార లరుదెంచిన దీ
నందన ముఖులకుఁ దెల్పిన
జెందిన వేడుకల నతఁడు శ్రీహరితోడన్. 6

ఉ. గూడి వివాహలగ్న మను కూలులతో వివరించి నేఁడె చే
కూడెనటంచు మైథిలున కున్ శుభలేఖ లిఖించిపంపి తో
డ్తోడనె పాండుభూవర సుతుల్ గయిసేయఁదలంచి వేడ్కతో
నూడిగపుంజనుల్ దగు ప్రయోజనముల్ సవరింపనేర్పనన్. 7

సీ. తళుకు కుందనఁపు క్రొం జిలుగైన నెరిఝరీ
పోషక్కుతో మద్య మునను గట్టి
పటకాగడీ కుసుం బాపాగ జుట్టి పై
సరిపీషుమల్లె పూ సరి తురాయి
పన్నీట చలువ దుప్పటిఁ దాల్చి చెమటార్ప
దుస్తురుమాలు హ స్తమున జెవుల
మొసలివాయొంట్ల సములు భుజకీర్తులు
బాజబందులు వ్రేళ్ళ బటువులుంచి

గీ. సరిగ పేషుబోంచీలు పచ్చలమురుగులు
వీరకంకణముల కర సారసములు
సురుతరతనంపు పేర్లు వీ రాంగదములు
పదములధరించి మేదినీ పతి జెలంగె. 8

చం. కలపము తావి ఘుమ్మురన గా వరకెంపవరంజి నొండొరన్
గొలిపిన గారపంటిపిడి క్రాంజిగిలీనును సొగసూరిపై
గల నడికట్టునందుఁజెమి కమ్మని వింటివజీరునాఁగ వె
న్నెల యెకిమీఁడునాగ నవ సీతలభర్త దనర్చె చూట్కికిన్. 9

సీ. అన్నుమిన్నుల నవ్వు వెన్నెలల్ పైఁబర్వ
పాండుభూవర తనూ భవతఁజూప

సుందరీ దీక్షావ § ళిందిందిరముగప్పి
ధర్మనందనత ప్రా ❘ ధాన్యపరుప
నాచార లాజాక్ష § తాళిపైఁ బర్విన
నుదయేందువంశ సం ♦ పదను బొదల
నందనా మంగళా ♦ హారతిద్యుతిఁబర్వ
పీతాంబరాప్తతా ♦ భిఖ్యగాంచ

గీ. సమరపురినుంచి తనుఁజూడ ❘ నరుగుదెంచి
భూమినంటక నడుమంత్ర § మున వసించు
వేల్పువేలఁదులు నా మ్రోల ❘ పెక్కు బల్ల
కటుపె నాడఁగా నాట ❘ కతె జతలు. 10

శా. భేరీడాన్నినదంబు నవ్వెనుక గం ❘ భీరారవాక్రామితాం
భోరాశిస్ఫుట వీరకాహళరవం ♦ బుందోడుతోఁ భట్లకై
వారంబుల్ తరువాత బ్రాహ్మణవధూ ❘ స్వస్త్యుక్తులన్ మీర నం
భారీనెక్కి నృపాలకుండుఁ దనునం § బారీలు వేగూడిరాన్. 11

మ. బిరుసుల్ గొమ్ములు తారజువ్వలు మతా § బీల్చెక్కువాయీలు కా
కరపూవత్తులు చక్రబాణములు లం § కాపుర్లు బుడ్లాదిగా
మిరుమిట్లున్ స్వజనావలోకమునకున్ § మిన్మన్నుదంతంబుయున్
గరదీపంబులచేత బట్టపవలై § గాన్పింపఁగా నత్తరిన్. 12

సీ. జగము పారల కెరుం § గఁగ దేల్పుగతి గుభుల్
గుభులంచు విజయదుం ♦ దుభులు మ్రోయ
దివియను మల్లెమం ❘ దిర మేలుకట్ల పో
లిక నున్నత ధ్వజాం ♦ శుకము లలర
చేరవచ్చిన కల్ప ♦ కారూఢి నటనట
కల్పిత సుమఫలా ❘ గములు వెలుఁగ
వేల్పులుగురియు క్రొ ♦ వ్విరులు నా పుణ్యాంగ
వలు సుమలాజాక్ష § తలను గురియ

గీ. భట్లు గొనియాడ విక్రమా । ర్భటులు దలఁచి
స్వస్తిఁ జెప్పంగ ద్విజులు ప్ర । శస్తిమీర
ధవళములు పాడ సతులు బాం § ధవులతోడఁ
దర్లె వైభవ సురరాజు § ధర్మరాజు. 13

సీ. వెలిగుబ్బగొడుగు ముం ♦ గల పట్టుతోడుతో
నాలవట్టములు జం । డాలు నడువ
జలమతీగుత్తాలు ♦ జోడు దారుగ సూర్య
భానులు పెక్కురు । బాజునత్త
చనవర యొత్తిగె ల § సత్తటనట వార
మునుమున్న సేవకుల్ ♦ కొలిచనంగ
పన్నీటి నిండుపాం § బనఁటులతోడ శా
లూల్లభంబులక్రింద । సువిదలు సగ

గీ. మెఱుగుటీటెల గమి మిరు § మిట్లుగొలుప
వీరయోధులు చౌడోలు ♦ వెంటఁగొలువ
దివి భువులవారి లోచనో § త్సవముఁగాఁగ
విడిది పెళ్ళికుమారుండు § వెడలనడచె. 14

వ. ఇట్లు పసవు పారాణి నెసఁగుచు ద్వారంబుల కిరుగడల పసిండి నిండుగుండలు రావి మావి మావి చిగురుగొమ్మలుంచి ఆవలీవల చెఱుకుగడల నరఁటిబోదెలు మొదలుగాఁగల మంగళ ద్రవ్యంబులు బొసంగంబట్టి, చీనాంబరంబుల మేలుకట్లను బచ్చతోరణంబులు గల్గి రాజిల్లు నప్పురరాజతోరంబు దారితొరుమ నేతెంచు నప్పుడు మేడిమాడుగుల పైడిగోడల చాటుననుండి పూఁబోడులు వేడుకలతోడ కేలుదమ్ము లమ్ములసాచి దీవనబ్రాలు జినుకుచు దమంగో నిటనిరి. 15

చం. వినుటయెకాని మున్న కురు । వీరవరేణ్యుని కన్నులారఁగా
గనుటయు లేదు నేఁడు శుభ । గంబగు భాగ్యవశంబుచేత గ

న్యూనగలిగెన్ నృపాలసుత ♦ కుం దగు నీ కురురాజవంశ వ
ర్ధనుఁ డితఁడీడు చూడ మిథి ♦ లాపతిసూతికి రూపురేఖలన్. 16

కం. నగుమొగము సొగసు తొగరా
నగు తొగరాధరకుశోక ♦ నదరుచి భళిరే
జిగిబిగి మైసోయగ మె
న్నఁగనగునే పన్నగేంద్రు ♦ నకు ముకురాస్యన్. 17

సీ. బవిరిగడ్డపు బాగు ♦ బాగు మీసముతీరు
ఆరెకన్బొమల యొ ❙ యార మహాహ
వాలుగన్నులు వహ ♦ వ్వా మోవికెంపవు
నవు భళీ దీర్ఘ బా ❙ హువుల సొగసు
వక్షస్థలంబు సే ❙ బాసు నెన్నఁడు మంద
మెక్కడకయిచంద ♦ మేమి జెప్ప
జంఘాయుగళి తమా ❙ షా పాదపద్మద్వ
యంబు లాగేమందు ❙ మమ్మ చిన్ని

గీ. నగుమొగము మేలుమేలు కం ♦ దర్పసుంద
రాంగు సీతనిఁ బెండ్లాడు ♦ మంగళాంగి
భాగ్యసంపద నేమని ❙ బలుకవచ్చు
ననుచు నన్యోన్యమును జెప్పు ♦ కొనుచు మఱియు. 18

గీ. ఒక హిడింబి కిమ్మీరుల ♦ సుకరప్రకర
పరచినాఁడు దోర్బలమువ ♦ మెఱసినాఁడు
దేవతానిభమూర్తి యు ♦ ధిష్ఠరాత్మ
సోదరుం డొకఁడుండె వృ ♦ కోదరుండు. 19

కం. నరుఁ గంటిరె నారాయణు
సరసన్ సరసాభ్రనీల ♦ సమవిగ్రహు నం
బురుహాయతలోచను భా
స్కరతేజుని వలపటన్ ని ♦ శాకరవదనా. 20

కం. కవలీ యిరువురలో నొ
క్కవతక్కవ గానరాదు ♦ కోమలతనురూ
ప విశేష వేషములనో
నవలామానికములార! ♦ నాకం జూడఁగ. 21

ఉ. చందనగంధిగన్నులను ♦ జల్లఁగఁ జూడగదమ్మ పెళ్ళివా
రందఱకన్న ముందర నె ♦ య్యారము మీరఁగఁ గోపసుందరీ
సుందరుఁ డిందిరాహృదయు ♦ చోరుఁడు వారలలోన పూర్ణిమా
చందురుఁడో యనంగ సర ♦ సత్వముజూపెడు పెండ్లిపెద్దయై. 22

సీ. యమునపై తాండవం ♦ బాడిన పదముల
గండపెండెరము న ♦ ల్లడలుకొనఁగ
నార్తరక్షాపరా ♦ యుతహస్తములను ముం
గాముఱుగుల్ భుజాం ♦ గదములమర
వైజయంతికి నిరు ♦ బాజుల వలెవాటు
వైచిన పసిఁడి దు ♦ వ్వాలువఁ జెలఁగ
పట్టుబొందునగట్టి ♦ చుట్టిన సంపంగి
మొగ్గలచే సిగ ♦ మురువుగులుక
గీ. చేరకన్నుల కరుణ ♦ ముక్కారుఁ గురియ
మందహాస్యామృతమున మో ♦ మందమూర
కులుకు జెలువాఱ గనువారి ♦ కెలమిమీర
సత్యసంపూర్తి గోపాల ♦ చక్రవర్తి. 23

సీ. అంభోధిలోన మీ ♦ నాకృతిజొచ్చి ధా
తకు శ్రుతులచ్చె నీ ♦ తండ్రిగాఁడె
కమఠమై మంధరా ♦ గము మోసి సురదేవ
తలకు నొసంగె నీ ♦ తండ్రిగాఁడె
వననిధి మగ్నమే ♦ దిని నుద్ధరించె భూ
దారవేషమున నీ ♦ తండ్రిగాఁడె

ప్రహ్లాదుఁ బ్రోవ గం ♦ బముసందు నారసిం
హుండయ్యె నాది నీ ♦ తండ్రుగాఁడె

గీ. ధర త్రివిక్రముఁడయ్యె నీ ♦ తండ్రుగాఁడె
ధరణినాథుల గెలిచె నీ ♦ తండ్రుగాఁడె
దాశరథియయ్యెఁ పిదప నీ ♦ తండ్రుగాఁడె
తాను బలరాముఁడయ్యె ని ♦ తండ్రుగాఁడె. 24

ఉ. చిక్కని గుబ్బచన్నుల దద ♦ జిక్కఁగ కౌఁగిట గారవించియుఁ
జెక్కులు ముద్దువెట్టుకొని ♦ చేరి చురుక్కున మోవినొక్కి దా
చక్కిలిగింతలన్ సురత ♦ సౌఖ్యపయోధిని నోలలాడు నే
చక్కెరబొమ్మ దానీదగు ♦ జన్మఫలంబు ధరాతలంబునన్. 25

వ. మఱియు నొక కన్యకామణి యిట్లనియె. 26

చం. కలసియు మేనుమేనొకటి ♦ గా సరిమోమున మోముజేర్చి చ
న్నుల నురమాని వాతెఱలు ♦ నొక్కి పరస్పరమోవితేనెలన్
గ్రోల యలుకల్వహించి వల ♦ పుల్ గొలిపించెడు నిట్టికాంతుతో
నలరుల పాన్పునన్ బొదలు ♦ నంగనదేగద భోగభాగ్యముల్. 27

వ. మఱియు నొక శుకవాణి యాజగన్మోహనునింగని యిట్లనియె. 28

ఉ. ఎందుకయోవయస్య నగ ♦ లెందుకు పుట్టములెందుకెందు కీ
చందురు కాలిపావడలు ♦ చల్లనితావులుజల్లు పువ్వుపా
న్పెందుకు వీని సందిట వ ♦ హింపకయుండిన సౌఖ్యమేగతిన్
జెందును మందయానలకు ♦ చెప్పరె చూపరె భూతలంబునన్. 29

వ. మఱియు నొక్క చక్కెరబొమ్మ యిట్లనియె. 30

ఉ. పిల్లనఁగ్రోవివట్టి వల ♦ పించును వీణెయమీటి పాడి రా
గిల్లఁజేయు నొక్కపుడు ♦ కేరుచు దాగుడుమూతలాడి రం
జిల్ల నొనర్చు కన్యకులఁ ♦ జెప్పు పదంబులు నేర్పు గోపికా
పల్లవపాణులన్ హరికృ ♦ పారస మేమనవచ్చు కోమలీ. 31

వ. మఱియు నొక్కచెలి చెలికత్తెతో నిట్లనియె. 32

చ. కొలకులపజ్జ సజ్జగఁపు ♦ గొజ్జగి పూఁబొదరిండ్ల మావితో
పుల సురపొన్నగున్నలను ♦ బూసిన మల్లెల నల్లిబిల్లిగా
గెలగొను ద్రాక్షపందిరుల ♦ క్రింద నహో రతికేళి నీహరిన్
నళినదళాక్షునిన్ గలయు ♦ నారుల నెన్నఁదరంబె కామినీ. 33

వ. మఱియు నొక శుకవాణి యిట్లనియె. 34

ఉ. శ్రీకరమైన మోము సర ♦ సీజదళంబుల గేరుకన్నులున్
బ్రాకటమైనవక్షమును ♦ బంగరురంగు జెలంగు శాలు శో
భాకరమైన బాహులు ద ♦ యా హృదయాబ్జముగల్గు నిట్టి సు
శ్లోకునిగన్న నందుని య ♦ శోద పురాతనపుణ్యమెట్టిదో. 35

మ. జలజాతాసన ముఖ్యదేవతల వా ♦ చాలోచనేషామనో
బల సంపత్తి వచింపఁ జూడఁదలఁపన్ ♦ భావింపఁగారాక ది
క్కుల నిండారి సమస్తజీవభయము ♦ క్తుండైన దేవుండు వీ
రలలో తానొకఁడై వెలుంగుట విచి ♦ త్రంబమ్మ ముమ్మాటికిన్. 36

మ. జలజాతాసనకంటె నీలజలద ♦ శ్యాముండు లోకత్రయా
నిలయుండాత్మపరాయణాత్ముఁడు శుభా ♦ నీతుండుపూతవ్రతుం
డలఘుండీతఁడు కాఁపుప్రాపు దరిదా ♦ పై యుండ నీ పాండవే
యులకెల్లప్పుడు శోభనార్థ కరుణో ♦ ద్యోగంబు వాటిల్లదే. 37

వ. అని యివ్విధంబున జవ్వనులు జెప్పుకొనుచు జూచుచుండ, నా
ఖండల, దండధర, వరుణవైశ్రవణ ప్రముఖులు పుండరీకాక్షు
నానతి పెండ్లికుమారునితోడ వేడుకనేతేర, పురోభాగంబున
చారులుబచారిసేయ, దివి నంటియున్న పందిరిక్రిందకిం జని చందు
వాల మేలుకట్లు నెడనెడలం గ్రుచ్చి కట్టిన పచ్చ తోరణంబుల
దారి నడిచి, పైడిగోడలు నెలరాలగంబాలబాలుచిత్ర పాంచాలి
కల నీలునగరు ధూపంబులతో మణిమయంబైన పీఠంబుల జాగు
మీరు కల్యాణవేదికా డుంబర పీఠంబుమీద ధౌమ్యాది పురో
హిత ప్రముఖ మహీదేవ స్వస్తివాచక సహితుండై నరదేవుండుఁ
గూర్చుండిన శ్రీకృష్ణదేవ దేవవ్రతాదులు విదేహ దేశాధీశ్వర

ప్రత్యుత్థానులై చిత్రకంబళపరిస్థిత చీనాంబర పర్యంకాసనంబులం గూర్చుండిరంత మిథిలాకాంతుండు దనకుం గూర్చువారినలన గులదేవత నిలిపి తదీయార్చావిధి సలిపి తత్సమీపంబునందు, ముందుగా గౌరతపస్సమేతయైన దన కూతుర్ వృద్ధసువాసినీ జాతంబుచేత రాబనిచిన— 38

## జనకుఁడు సాలంకృత కన్యాదానము సేయుట

కం. వచ్చె మిథిలేంద్రతనయర
ణచ్చరకాంగద ఝణంఝ ♦ ణంధని మణిసం
పచ్చతుర కంకణధ్వని
రచ్చం గూర్చున్నవారి ♦ రంజిలఁజేయన్. 39

కం. క్రేగంటిచూపు లిర్వురు
లోగల రాగమ్ములంత ♦ లో మెలకొను పై
తీగెలు సాగఁగఁ దమతమ
లాగులు బాగులును తలచి ♦ రాత్మలలోనన్. 40

వ. అంతలోన. 41

చం. కలువలతేని రేకమొల ♦ కట్టిన పైడిశలాక సోయగం
బుల తెలిమోక మానికఁపుప్రోక ♦ జగాజిగిరూక తక్కుజో
క్కుల తనివోక దీని కుచ ♦ కోకములక్కున జిక్కి జోకులో
గలసి మెలంగుదాఁక నల ♦ కమ్మని వింటివజీరుఁ డోగ్గునే. 42

వ. అనునంతలోన. 43

గీ. కప్పుకొప్పున ఘనలక్ష్మిఁ ♦ గాంచి వదన
పద్మమున పూర్ణరాజ వై ♦ భవమునొంది
కలసి కుచపాళి చక్రవ ♦ ర్తుల గతిగని
నడుమునను మిన్నుముట్టె భూ ♦ నాథ దృష్టి. 44

గీ. తోడ నలకాభిరూప సం ♦ తుష్టిచరణ
కరమహా పద్మపద్మ ప్ర ♦ కాశపుష్టి

కనుట ముఖరాజరాజ భా ◆ గ్యప్రపూర్తి
కే గొండవె నాభిచంచలా ◆ లోకములకు. 45

సీ. తరువాత ధౌమ్యాది ◆ ధరణీసురోత్తముల్
వేట్క నా డుంబర ◆ పీఠమందు
నునిచి వధూవరు ◆ లనుమంగళార్థక
వస్తువుల్ దెప్పించి ◆ స్వస్తిపూర్వ
కముగ విఘ్నేశుసం ◆ కల్పోక్తముగను బూ
జించి పుణ్యాహంబు ◆ జేసి చూత
పల్లవాంకురముల ◆ పాణి కంకణములు
గట్టించి పుణ్యోద ◆ కములచేత

గీ. మంగళాస్నాన మొనరించి ◆ రంగనలు శు
భాంగులగు వారలకు సమ ◆ యంబునందు
యొసఁగె మధుపర్కము విదేహ ◆ వసుమతీశుఁ
డర్థి దంపతులకును కృ ◆ ష్ణాజ్ఞచేత. 46

కం. సాలంకృతముగ జనక
క్ష్మాలల నేశుండు కన్య ◆ కాదానము శా
స్త్రోల్లంఘనముగఁ జేసెను
మేలుగ భరతాన్వయాబ్ధి ◆ మిహిరాంశునకున్. 47

ఉ. మంగళసూత్రమా నృపకు ◆ మారుఁడు గట్టెను ప్రేమమీరఁగా
సంగన కంఠదేశమున ◆ నంతట దెచ్చిన క్రొత్తముత్తెముల్
బంగరు పళ్లెరంబులను ◆ పాణియుగంబుల బట్టియెత్తి స
ర్వాంగకలగ్నమై తనర ◆ బాడి రొగిన్ తలఁబ్రాలులీలతోన్. 48

గీ. దంపతుల కర్థి వస్త్రబం ◆ ధంబు మున్ను
గానొనర్చి యాశీర్వచో ◆ క్షతలు జిలికె
క్రమముదప్పకయుండ పా ◆ దములు ద్రొక్క
లాడజేసి రన్యోన్య శు ◆ భావహముగ. 49

వ. తదనంతరంబ సాక్ష్యగ్నిహోత్రంబునందు లాజహోమంబు జేయించి, మూఁడవనాఁడు వేఁడుకతోఁడ సదస్యాశీర్వచనంబులు జేయించి నైదవనాఁడు నాకబలిజేయించిరా కళ్యాణోత్సవ దినంబులయందు. 50

కం. సతులకు సతిసుతవతి సం
తత సౌభాగ్యవతి తన్ను దర్శించిన దం
పతులకు మేలిచ్చు శుభ
స్థితియని చేసిరి యరుంధతీ దర్శనముల్. 51

వ. అంత విదేహ మహీకాంతుండు నిజసంతతి వివాహంబునకు వచ్చిన బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రప్రముఖులకు నట నటీ గాయక ప్రముఖులకు నామెత వెట్టించిన. 52

సీ. కూరలు తృప్తిచే కూరెను మాకని
పచ్చళ్లుఁ దెమ్మని ప్రాకువారు
భక్ష్యముల్గొంటి మీ పాటి పాయసముఁ ది
మ్మనములు దెమ్మని పలుకువారు
పచ్చళ్లు రుచిగానఁబడియెను మా కింక
పులుసు చారిడుమని పలుకువారు
పులుసుచారులు తృప్తి బొందితిమిఁక మాకు
భక్ష్యముల్ దెమ్మని బలుకువారు

గీ. పాయసము తిమ్మనములుండె ఫలరసములు
పెరుగు పాల్పళ్ళు తెమ్మని పిలుచువారు
నగుచు బ్రాహ్మణముఖ్యు లాద్యంతయుక్త
భుక్తి కెవ్వననార్చి ర ప్పుడు విభుండు. 53

మ. నను కారుణ్యముతోడఁ జూచి విబుధుల్ నావండి వడ్డించు భో
జనశాకాదులు పాక మిష్టరుచి మి శ్రంబైన కాకుండ నుం
డిన జలారిన వెచ్చహెచ్చయిన నీ నేరంబు గావాడినా
మన నాలించి భుజించుఁడోపిక మిముల్ ప్రార్థింతు మమ్మాటికిన్.54

గీ. అనుచు పంక్తులుఁ దిరుగ నా ♦ ద్యంత యుక్తి
భుక్తి కెవ్వన నార్చిరి ♦ భూసురాళి
తృప్తిగాంచి నమః పార్వ ♦ తీపతే య
టంచు నొక్కట గోవింద ♦ యనుచు నొకట. 55

వ. తదనంతరంబ కామధేను కల్పవృక్షంబులు సాక్షాత్కరించు చందంబున, భక్ష్య, భోజ్య, లేహ్య చోష్య పానీయములచే సుభిక్షపడి లేచి హస్తప్రక్షాళనాదికంబులు దీర్చి కూర్చున్న బ్రాహ్మణ క్షత్రియాదులకు దక్షిణ తాంబూలంబులం దృప్తియొనర్చి దతను జ్ఞాతుండై నిజనికేతంబునకు తన కూతు నల్లుని రావించి. 56

కం. అరణంబు లేర్చి యిచ్చిరి
కరిహయ గోధన సహస్ర ♦ క గ్రామములా
భరణములు దాసదాసీ
పరిజన మణిరథములిచ్చి ♦ పరమప్రీతిన్. 57

వ. జనకుండు దానును దన భార్యయుఁ బాల నేతుల జేతులం దడిపి తన గూతుం బృథావాసుదేవ ధర్మజదేవవతీ జాతాదులకు నప్పగించునెడ నానందబాష్పంబు లొలుకంగ గదద కంఠంబుతో నిట్లనియె. 58

ఆ. వె. మోదమలర యింక ♦ మీాద నె ౘయి పాల
ముంచిదైన సీల ♦ ముంచిదైన
గోలదైన దీని ♦ కూర్మి మీారందఱు
స్నేహమునను రక్ష ♦ సేయవలయు. 59

ఆ. వె. బాలచిన్ననాటఁ ♦ గోలె గోలలతోడ
నాడుచుండు ప్రాజ్ఞు ♦ లిడిరఁ దెలిసి
తిరుగలేదు తేట ♦ తెల్లంబుగా బుద్ధి
తెలియుదాక దిద్ద ♦ వలయుదీని. 60

వ. అని వేర్వేఱ నప్పగింతలుఁ జేసి తత్సఖీరత్నంబుతో నేకాంతంబు నకుఁ దన కూతురు రావించి వృద్ధకామినులం గూర్చి దీనికిఁ దగిన హితవాక్యంబు లెఱిఁగింపుమన తజ్జనని 1మున్నుగాఁ దాని కిట్లనియె. 61

కం. ఇలువరుస కి హిత కృతి
కలికి వినయ శౌర్య ధైర్య ♦ గాంభీర్యదయా
దులు విడువఁజనదు సతులకు
కలకాలము మంగళాంగి ♦ కలలోనైనన్. 62

ఉ. బావలపట్ల బాంధవుల ♦ పట్ల మరుందులపట్ల ధారుణీ
దేవతకోటిపట్ల హిత ♦ దేశికమంత్రి పురోహితాశ్రితా
ర్యావళిపట్ల భృత్యనివ ♦ హంబులపట్ల నయోచితాత్మయు
నై విభునాజ్ఞ మామలకు ♦ నత్తల కింపొనరింపఁగాఁదగున్. 63

కం. అత్తింట నీవు యెదురను
చిత్తమెఱిఁగి నీవు జనుల ♦ చే కులమునకున్
అత్తకు మామకు హితవుగ
పుత్తడి చిటిబొమ్మ మాకు ♦ పూజ్యత చెమ్మా. 64

వ. అనవుఁడు వృద్ధకామినులగు చెలికత్తెలిట్లనిరి. 65

కం. ఏపట్లనైన పతి కెదు
రై పలుకక తద్ధితైక ♦ లాలసలోలా
వ్యాపారం బొనరించుట
యే పాతివ్రత్య ధర్మ ♦ మిది విధువదనా. 66

కం. పతిహితము సతుల కఘసం
తతిని హరియు నిఖిలవాంఛి ♦ త సంకృతయు మహో
ద్భుత సుకృత గతియుసుఖదా
ప్రతియు సఖీ చారు సరస ♦ పంకేజముఖీ. 67

(1) మొదటగా యని యర్థము.

సీ. మగనిమా టడుగుదా ♦ టఁగరాదు సుమ్మిల
గుణియైన కాకున్న ♦ క్రూరుఁడైన
ధవుమాట జవదాటఁ ♦ దగదు రూపియునైన
కోపియైన మహా కు ♦ రూపియైన
పతిమాటలెంచుట దప్పుఁగరాదు ♦ గడుసైన
చెడుగైన బడుగైనఁ ♦ జడుఁడునైన
వరుమాట మీరుట ♦ వలదు భోగియునైన
రోగియైన పరాను ♦ రాగియైన

గీ. గానదేవుఁడు గురుఁడే ♦ దుగడయు నెడయు
ధనము మనమును జీవబాం ♦ ధవుఁడు దవుఁడె
అట్టి పతి మీరరాదింత ♦ యనగ మగని
కాయు సంబంధి సరస చాం ♦ పేయగంధీ. 68

చం. కువలయపత్రనేత్రి తన ♦ కూర్మివిభుండు విదేశమేగుచోఁ
వివిధవిలాసవైఖరులు ♦ వీడియు జీవన పోషణార్థ భు
క్తవిధియొనర్చు కార్శ్యతన ♦ ధర్మ్యయనం బొనరించి జీవబాం
ధవు ధవుగూడి వెండిసుఖ ♦ తత్పరతన్ జనుటొప్పు సాధ్వికిన్. 69

గీ. పనుల వినయోక్తి యుపచరిం ♦ ప భయయుక్తి
కుడువుతరిభక్తి శయనింపు ♦ నెడల రక్తి
సత్క్రియాసక్తి క్షమయందు ♦ చాలశక్తి
గలది కులవర్ధని యటంద్రు ♦ కమలగంధి. 70

సీ. పరుల వీక్షించుట ♦ బహుభాషిణియునౌట
పొరుగిళ్ళ కరుగుట ♦ తిరిగికనుట
పతికి మార్వలుకుట ♦ పకపకనవ్వుట
పతిభక్తి విడచుట ♦ భయముచెడుట
పరునితో నలుగుట ♦ దరవంగ నడుచుట
పవలు నిద్రించుట ♦ పాటుచెడుట

మునిమాపు తలద్రిప్పి ♦ మూడుచుట గుడుచుట
ఘనబుద్ధి నెడలుట । కరుణ విడుట

ఆ. వె. మానినులకుఁదగదు ♦ మఱియొక్కటాలింపు
సకలభోగభాగ్య ✧ సౌఖ్యప్రదవు
లుండెనేని సతుల ♦ కొకటేఁ దప్పఁగరాదు
వరునియాజ్ఞ పృథ్వి । పరమసాధ్వి. 71

ఆ. వె. తల్లిదండ్రు లన్న ♦ దమ్ములు ముదమొంద
నుభయవంశకీర్తి ✧ గొచ్చమొదవ
కుండ ఘనతమీర । నుండుట తగియుండు
ఖంజరీట జనము ♦ గరిమఁజూడ. 72

వ. అని బహుప్రకారంబులం బుద్ధులందెలుపు వృద్ధసతీజనంబులకు మ్రొక్కి తల్లికి నమస్కరించి, పెనిమిటి యాసఁ ఘనమైనపుట్టింటి యాస పోలతులకు బలువగుటంజేసి చెలులం జూచి బాష్పకలిత నేత్రయగుచు తలవంచిన "యిట్లు విచారింపఁదగునా? ఏమిందులో నిన్ను బాయంగలవార మెవ్వారమందు యిందు నిన్నుంగూడి యుందు మందన్యు లెవ్వారనుచు" యూరార్చి చెలులుచుట్టు రాగతజ్జననియగు జనకపురంధ్రీ రత్నంబా కన్యారత్నం బానంద బాష్పంబు లొలుక గద్గదస్వరంబుతోప వందనాభిప్రాయంబుగా రక్షసేయవలయుననుచు పృథాదేవి కరంబులో కరంబులుంచి యప్పగించె తదనంతరంబ. 73

ఉ. కోరికమీర నల్లునికిఁ ♦ గూతుకు బ్రాతిగ కట్నకానుకల్
కూరిమి నిచ్చిపంపె జన ✧ కుండిరువాగులు గూడి పెండ్లికిన్
జేరిన చిన్నపెద్దలకు । చేతులకొద్ది యభీష్టవస్తువుల్
భూరిగనిచ్చిపంపిరి నృ । పుల్ తను నర్థినుతింప భూవరా. 74

వ. ఇట్లు కానుకలంది అద్ధరా సురోత్తములు పరమాత్ముండయిన శ్రీకృష్ణదేవుని స్తుతించి. 75

## ముక్త పదగ్రస్తం

సీ. శ్రీవధూపేత యా । శ్రిత పారిజాత దే
వారిజశ్యాత । దివ్యాస్త్రభాత
జాతరూపదుకూల । సత్యానుకూల శీ
లాంశుభృల్లోల । చిన్మార్గఖేల
ఖేలసత్త్వత్రయాం । కిత సుచారిత్ర నీ
లాంబు భృచ్చిత్ర ని । లాభగాత్ర
గాత్ర శృంగార రే । ఖామిష్యమార గో
త్రావనోదార గో । త్రాధికార
గీ. కారణాధార శ్రీకర ♦ గర్వదూర
దూరితా శేషబంధుర ♦ దుర్విచార
చారణాధార గోచర ♦ సారహార
హారకీర్తి ప్రభాహారి ♦ దంతవార. 7౬

## సమలఘుసీసము

సీ. కరివరద విశద నవసర ♦ సీరుహదళయన
ధరణి ధగవరశయన ♦ గరుడగమన
దృఢకదన మధుమదన ♦ రుధిరభుగధికరధిక
ని బిడకథి కధిదహన ♦ విబుధసదన
అరికరణ సురశరణ ♦ సరసతిరసయ మహిత
నిరుపమితగుణ సరణ ♦ నిగమభరణ
కువిహరణ భవతరణ ♦ భువనభవ పటుచరిత
తరు తిమిరహరణాల స ♦ దరుణకిరణ
గీ. విదిమునిజన పరికర ♦ హృదయ శుభ ద
కనదమృత మయసకిరణ ♦ కలిత సరస
వివిధ సకుల సనలపయువ ♦ యువతి నివహ
బహుళ సుమశర నతహిత ♦ ఫలవితరణ. 77

వ. అని మఱియు నిట్లనియె. 78

మ. హరినారాయణ కృష్ణ కేశవ వికుం‡ ఠావాస గోవింద శ్రీ
ధరదామోదర చక్రపాణి పరమా‡ త్మా పుండరీకాక్ష శం
కర గోపాలక గోపికా రమణ లో‡ కత్రాణ పారీణ మం
ధర శైలోద్ధర మాధవాచ్యుతముకుం‡ దా వృష్ణివంశోదయా. 97

సీ. వసుమతీ భారంబు ‡ వాప దేవకిగర్భ
మున వసుదేవనం ‡ దనతఁ గాంచి
వ్రేపల్లెలో నంద ‡ గోపాలు నింటను
బెరుగుచుఁ బూతనఁ ‡ బిలుకుమార్చి
శకటతృణావర్తు ‡ లకు మోసము ఘటించి
మద్ద్రుమానుం బల్మి ‡ కొద్దిపరిచి
గోప కన్యకలలో ‡ కువఁ జేసి వసియించి
పాలు పెరుగును వెన్న ‡ గ్రోలి మెసఁగి

గీ. గోవులను గాయ దిరిగి బ్బం‡ దావనమున
గోపరక్షణార్థము కొండ ‡ గొడుగుఁ జేసి
కంసముఖుల నణఁచి ద్వార ɩ కను వసించి
పాండవులఁ బ్రోవవచ్చిన ɩ పరమపురుష. 80

ఆ. వె. నీవు నిలుచుచోట ♦ నిత్యకల్యాణంబు
పచ్చతోరణంబు ♦ ప్రజకు నిళ్ళ
నీదు దర్శనంబు ♦ నిఖిల లోకానంద
పూరకంబు సకల ♦ కారకంబు. 81

ఉ. కావున నీదుదర్శనము ɩ కంటిమి మంటిమి నేటితోడ సా
ఖ్యావహవృత్తినుండెద మనంతము ɩ గాఁగ నిజాలయంబులన్
దేవరయానతిన్ నిజస ɩ తీసుత బాంధవ మిత్రభృత్య సం
భావనయుక్తి నుండెదము ɩ పాపవిమోచన పద్మలోచనా. 82

ధర్మరాజు కలావతితో యింద్రప్రస్థంబు చేరుట

వ. ఇట్లు వివాహమహోత్సవంబునకు వచ్చిన ధరాదేవ, నరదేవాదులు హరినారాయణ మిథిలాధినాథులచేత ననుజ్ఞాతులై నిజ

నివాసంబులకుం జనిరి. కురుపాండవులు బుండరీకాక్షుం బురస్క
రించుకొని వధూవరులతో మంగళరతోరణాలంకృతంబును, మద
మాతంగ దానోదక పంకిలంబును, బహుపతాకాభిరామంబును
బహువితానవద్య వాద్యమాన ఘూర్ణమానంబైన యింద్ర
ప్రస్థ పురంబునందు బ్రవేశించి ధర్మనందనుండు— 83

గీ. తల్లులకు వృద్ధకాంతామ ♦ తల్లులకును
క్రమముతో ♦ మ్రొక్కి దీవనల్గాంచి నిజవ
ధూసమేతముగ పరమసం ♦ తోషమునను
సుఖతరంబుగ నుండె భూ ♦ సురవరేణ్య. 48

కం. తరువాత పెద్దలందఱు
సరసంబై తగు ముహూర్త ♦ సమయమున వధూ
వరులకును శోభనోత్సవ
మరుదుగ సేయంగదలంచి ♦ యానతిసేయన్. 85

చం. సొగసున కల్కి ముగ్గులిడి ♦ చూట్కికి వేడుకసేయు మేడలో
పగడపు కోళ్ళ పట్టెయల ♦ బాగగు పందిరిపట్టెమంచమున్
అగణిత భోగవస్తుచయ ♦ మర్థి నమర్చి గృహప్రవేశమున్
దగ నొనరించిరా ధరణి ♦ నాథుని ముందుగ వెన్క కోమలిన్.86

## దంపతుల అన్యోన్యానురాగ సల్లాపములు

ఉ. అపుడెడ లేని మోహమున ♦ నమ్ముకురానన చేరదీసి చే
కపురపు వీడియంబిడి సిగన్ మెడఁ గ్రొవ్విరిదండలుంచి ని
ద్దపు మెరుగారుచెక్కులకు ♦ దారిచి కేల్గొని ముద్దులంతఁగో
నృపకుల సార్వభౌముఁ డొన ♦ రించె ననేక మనోవినోదముల్.87

సీ. నిగనిగలాడు సోగ యగఁపు నుంగెక్కుల
వేడుకతోడ ము ♦ ద్దాడవలదె1
పగడంబుచాయల ♦ నగు జగాజిగిమీగు
గొనబైనవాతెఱ గ్రోలవలదె2

1, 2 'నియవె' యని పాఠాంతరము.

పసిఁడిచాయల మిస ♦ మిస లెసఁగెడి మేను
లీలతోఁడుత ♦ కౌఁగలింపవలదె3
తగగుల్కు బిగిగుల్కు ♦ సొగసైన గబ్బిగు
బ్బల బలు కూర్మితో ♦ బట్టవలదె4

గీ. ఇంత యిటువేడినను కేళి ♦ కియ్యకొనక
కంతు పూదూపులకు నప్ప ♦ గింతఁజేసి
స్వాంతమున నక్కటికమూను ♦ మింత పంత
గింతురా కుందరదన ♦ పంకేజవదన. 88

మ. నను నీవానిగ నేలుకో మదనబా ♦ ణవ్యాప్త సంతాపమూ
ర్ఛ నుపాయంబు సుధాధరంబు ననుకం ♦ పన్ గ్రోలగా నిచ్చినా
మని లాలించియు కౌఁగలించి సుఖసాం ♦ బ్రాజ్యంబు పాలించుకో
విను లజ్జాభర మేలుకోగనుము నన్ ♦ విస్ఫార క్రీగన్నులన్. 89

సీ. మకరికల్ వ్రాతు నీ ♦ ముకుర కపోల నీ
దులకీమనమ్ము మ ♦ న్మథునితోఁడు
పూదండలుంచెద ♦ పొలతి నీకీల్జడ
సరస కేతెమ్ము వ ♦ సంతుతోఁడు
తిలకంబుదీర్చెద వెలఁది నీ ♦ మొగమిమ్ము
దప్పించుకోకు చం ♦ ద్రమునితోఁడు
గంధసారము చను ♦ గవనందెదను రమ్ము
కమలాక్షి వలిమొట్టు ♦ గాడ్పుతోఁడు

గీ. సిగ్గు విడనాడవేటికే ♦ చిగురుఁబోఁడి
పలుకు లాలించవేటికే ♦ జలజగంధి
కౌఁగలియ్య విడేటికే ♦ కంబుకంఠి
వీడియం బందవేటికే ♦ విద్రుమోష్ఠి. 90

చ. అని బ్రతిమాలి మోహభర ♦ మానగలేక నరేంద్రచంద్రుఁ డో
య్యన దనకేలుసాచి ముకురా ♦ నన కేలొన చేరబిల్చి పా

3, 4 'నికావె' యని పాఠాంతరము.

న్పన నెలకొల్పి మెల్లన క । పోలములంటుచు మోవితేనియల్
గ్రోలుచు కవుంగిలించె మఱి । లోంగిపమీఁదట నేమిసేయునో? 91

కం. సతికైదు ముళ్ళు గలవఁట
పతివిప్పును రెండుముళ్ళు । బలవంతమునన్
హితవున నొకముడి వీడును
సతి దక్కిన రెండుముళ్ళు । చయ్యనవీడున్. 92

చం. అని సరసోక్తులాడుచు ల । తాంగి కనుంగవలన్ వరాంగమం
దును గళమందు జెక్కులను తోరపుచన్నుల హ స్తయుగ్మమం
దొనరఁగ నూల్మి ముద్దుల స । ముజ్వలతన్ దగబెట్టి మేళ్కలన్
దనరు పదార్లు గు త్తెఱఁగి తన్విని । దా రమియించు వేడుకన్. 93

కం. ధవళాక్షి నీవు నేనుం
దవిలి మనోజాతదేవ । తా ప్రీతిగ ను
త్సవ మొనరించఁగవలె నీ
వి విడచి నే జెప్పినట్లు । వినవే యింకన్. 94

ఆ. వె. అనుచు నవ్విధమున । నవ్వధూవరులంత
యింత యనఁగరాని । కంతురాజ్య
భోగవార్ధి దేలి । రాగమ్ము మది నూక
దినదినంబు కోర్కె ♦ కొనలుసాగ. 95

సీ. క్రీడాచలంబుల । వేడుకతో గొంత
మేడమిద్దెలలోన ♦ గూడి కొంత
పూఁదోటలకు నేగి । పూలుగోయుచు కొంత
కొలకులలో నీరు । గొనుచు గొంత
సొగటాలపాళిఁ జూ । చుచు నాడుచును గొంత
చాటు గాథాప్రసం । గనల గొంత
పొలయల్కలూని త ♦ ప్పులు పట్టుచును గొంత
గడగడ ♦ గె సేయగనుచు గొంత

గీ. పొద్దు జనువోకపుచ్చుచు ♦ భూవరుండు
నూతనకళాను మూర్తాను ♦ భూతి మెరసి
స్వాంతమునకును బలుకున ♦ సాటిలేని
యంగ భవభోగ సామ్రాజ్య ♦ మనుభవించె. 96

కం. బహుదినములిట్లు సతితో
మహిపతి కేళీవినోద ♦ మతి జరియింపన్
మిహి రాకరముఖి కంతట
విహితంబై గర్భభార ♦ విధ మగుపడియెన్. 97

సీ. అలయిక బలువయ్యె ♦ నెలకొనె నోకిలిం
తలు చనుముక్కులు ♦ నలుపుగ్రమ్మె
చెక్కులు తెలుపెక్కె ♦ గ్రిక్కిరిసెను నగల్
గౌనుదీఁగె యొకింత ♦ గానవచ్చె
కును కెక్కువయ్యెను ♦ దినుకూడు కూరల
సహ్యమయ్యెను మన్ను ♦ సహ్యమయ్యె
చిత్తము రంజిల్లె ♦ క్రొత్తరుచుల్ గోరె
నాలుక బరువయ్యె ♦ జాలు మేన

గీ. నంతఁ గనుగొని యా మహీ ♦ కాంతుఁడు దన
పొలతికి నొనర్చె సీమంత ♦ పుంసవంబు
లార్యసమ్మతి జేకొని ♦ యతిరయమున
చనియె నవమాసములు పూర్ణ ♦ చంద్రముఖికి.

ధర్మరాజునకు విదేహ రాజు జననము

కం. కనియె సుముహూర్తసమయం
బునపుత్రునిఁ గులపవిత్రుఁ బుణ్యచరిత్రున్
దను రూపాంచిత కైరవ
వనమిత్రున్ భోషితాగ్ర ♦ వర్ణు సుమిత్రున్. 99

వ. తదనంతరంబా ధర్మనందనుండు కుమారోదయంబున కత్యంత సంభ్రమానందమంది, వసుంధరా సుధాంధులకు గోభూ హిరణ్యాది దానంబులిచ్చి జాతకర్మంబు నిర్వర్తించి 100

సీ. నామకరణంబు జేసె భూ ♦ నాయకుండు
శుభముదంబున వైదేహ ♦ గర్భజనకు
ధీరసమ్మతమునను వై ♦ దేహుఁడనుచు
భూతజాతంబు సంతోష ♦ మున భజింప. 101

వ. తదనంతరంబ. 102

చ. దినదినమా తనూభవుఁడు ♦ తేటఁగ వృద్ధిని బొందుచుండఁగా
తనపతి ద్రౌపదీ సతియు ♦ దానును దమ్ములు తల్లులాప్తులున్
దనయులుగొల్వ సర్వవసు ♦ ధాస్థలి యేలె సుఖోపవిష్టుఁడై
ఘనుఁడగు ధర్మరాజు తన ♦ కైవశమై ధరరాజులుండఁగన్. 103

మ. క్షితిదేవుల్ శుభమాచరింప నృపతుల్ ♦ సేవింప విట్శూద్రసం
తతి మోదింప మహాకవీంద్రులు ప్రబం ♦ ధమ్ముల్ రచింపన్ సదా
శ్రితులై గాయకసూతమాగధులు వర్ణిం ♦ పన్ నటింపన్ మహో
చ్ఛ్రిత నేలెన్ సుఖముండి ధర్మజుఁడిలా ♦ చక్రం బవక్రంబుగన్. 104

వ. అని చెప్పిన జనమేజయుండు వైశంపాయనునభినందించుటయును.

## ఆశ్వాసాంతము

మ. విమలాదిత్య సమానతేజ సకలో ♦ ర్వీరాజ సంసన్నుతో
త్తమ చిత్తోల్లసితప్రధాన గుణసం ♦ ధానా సదాదాన సం
భ్రమితారాతి వితానదోర్బల సము ♦ ద్రక్షోభ్యమాణార్య శ్రీ
కమలాక్షాంఘ్రి సరోజగాత్మ హృదయా ♦ కందాళ గోత్రోద్భవా.

కం. వెలిచెటి కామయకుల మం
గళధాత్రీ వెంకమాంబ ♦ కాగర్భపయో
జలనిధి పూర్ణాత్రేయా
విలసద్గుణ గురువరాయ ♦ విద్వద్గేయా. 109

### మాలినీవృత్తము

కవిజనసురభూజా ! గాఢ ధైర్యాద్రిరాజా
కువలయహితరూపా ! కుంఠితారిప్ర
సపనయజనపోషా ! సత్యభాషాభిలాషా !
ప్రవిమలగుణపూతా పాపరాయానుజాతా 108

### గద్యము

ఇది శ్రీ శివరామేశ్వరానుగ్రహపాత్ర భారద్వాజసగోత్ర
పవిత్ర కాళ్లకూరి సూరయకవి పుత్ర కించిదాంధ్ర
రచనావిధేయ గౌరీకాంత నామధేయ
ప్రణీతంబైన ధర్మనందన విలాసంబను
మహాప్రబంధమున సర్వంబును,
తృతీయాశ్వాసము
సంపూర్ణము.

శ్రీ శివరామేశ్వరార్పణమస్తు.



# తప్పొప్పుల పట్టిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 11 | 11 | యూధాంత | యూధ |
| 17 | 6 | 20 | 70 |
| 17 | 22 | రోహిణో | రేవతీ |
| ,, | 26 | 7 | 75 |
| 18 | 6 | నైతు | నైదు |
| 20 | 16 | 38 | 83 |
| 28 | 15 | కల | కలు |
| 30 | 9 | లాలికా | లావికా |
| 30 | 18 | సనుచు | వనుచు |
| 31 | 23 | జెలలు | జెలులు |
| 32 | 4 | నిచ్చల | నిచ్చలు |
| 32 | 19 | వై | వైరి |
| 33 | 11 | ద్వేషి | విద్వేషి |
| | 23 | గుణరర | గుణర |
| 35 | 76 | దాయక | దాయ |
| 37 | 8 | కునుగాని | కోరుగాని |
| 40 | 21 | సీరువుర | సీరివుర |
| 41 | 5 | ఖరమృష్టిఘృట — | ఖరఘృష్టి స్ఫుట |
| 42 | 27 | యుక్సిక్ష | యుక్మీర్ష |
| 44 | 11 | భృన్గత్త | భృన్మస్త |
| 47 | 26 | దూటి | మాటి |
| 51 | 21 | ధారర | ధాధర |
| 54 | 7 | కర్మ | కర్ణ |
| 55 | 7 | జేసె | జేసి |
| 55 | 20 | మించి | వించి |
| 60 | 5 | సాపు | సాప్తు |
| 63 | 8 | సుతతి | సుదతి |
| 67 | 3 | న | నన |
| 68 | 18 | టురుక్మి | టిదున్మి |
| 73 | 1 | యుపాలించి | యుపాలంచించి |
| 75 | 20 | బనంత | బనంతా |
| 76 | 25 | వెంకట | వెంకణ |
| 78 | 21 | జేర్చి | దేర్చి |
| 81 | 24 | చిక్కార్చి | చిక్కేర్చి |
| 82 | 1 | గాను | లేగాను |
| 83 | 12 | రపుకాశికపుగుత్తిరాళ్లకట్లు- (పాఠభేదము) | రపుకాశికుత్తికంట్లు పవడాలు |
| 84 | 22 | నను | నును |
| 85 | 16 | ధాత్రికిని | ధాత్రికి |
| 88 | 15 | హారద | శారద |
| 92 | 5 | యూర్ధ్వములిడి | మూర్ధమణి |
| 95 | 13 | శాంతము | సాంతము |
| 98 | 13 | పీషు | ఫేషు |
| 106 | 22 | బాడి | నాడి |
| 108 | 8 | దత | తద |
| 109 | 12 | నత్త | వత్తల |
| 112 | 5 | లాంశు | తాంశు |
| 115 | 13, 14 | కపోలనీదుల— కీమ మేలుకో | కపోల సీమలలేమ మేలకో |
| ,, | 24 | మౌష్షి | మోష్టి |
| 116 | 9 | లఞ | లల్ |
| | 24 | ప్రసంగ | ప్రశంస |

—

ప్రతులకు:—

శ్రీ వెలిసేటి సీతారామస్వామిచౌదరిద్వార

చిననడిపల్లి గ్రామం

గొల్లలపాలెం పోస్టు, చీపురుపల్లితాలూకా, విశాఖపురి జిల్లా.

## మాలినీవృత్తము

కవిజనసురభూజా ! గాఢ ధైర్యాద్రిరాజా !
కువలయహితరూపా ! కుంఠితారిప్రతాపా !
సవినయజనపోషా ! సత్యభాషాభిలాషా !
ప్రవిమలగుణపూతా ! పాపరాయానుజాతా ! 108

## గద్యము

ఇది శ్రీ శివరామేశ్వరానుగ్రహపాత్ర భారద్వాజసగోత్ర
పవిత్ర కాళ్లకూరి సూరయకవి పుత్ర కించిదాంధ్ర
రచనావిధేయ గౌరీకాంత నామధేయ
ప్రణీతంబైన ధర్మనందన విలాసంబను
మహాప్రబంధమున సర్వంబును,
తృతీయాశ్వాసము
సంపూర్ణము.

శ్రీ శివరామేశ్వరార్పణమస్తు.



# తప్పొప్పుల పట్టిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 11 | 11 | యూధాంత | యూధ |
| 17 | 6 | 20 | 70 |
| 17 | 22 | రోహిణి | రేవతి |
| ,, | 26 | 7 | 75 |
| 18 | 6 | నైతు | నైదు |
| 20 | 16 | 38 | 83 |
| 28 | 15 | కల | కలు |
| 30 | 9 | లాలికా | లావికా |
| 30 | 18 | సనుచు | ననుచు |
| 31 | 23 | జెలలు | జెఱలు |
| 32 | 4 | నిచ్చల | నిచ్చలు |
| 32 | 19 | వై | వైరి |
| 33 | 11 | ద్వేషి | విద్వేషి |
| | 23 | గుణరర | గుణర |
| 35 | 76 | దాయక | దాయ |
| 37 | 8 | కునుగాని | కోరుగాని |
| 40 | 21 | నీరువుర | నీరివుర |
| 41 | 5 | ఖరమృష్టిఘృట — | ఖరఘృష్టి స్ఫుట |
| 42 | 27 | యుక్సిక్ష | యుక్మీర్ష |
| 44 | 11 | భృన్గత్త | భృన్మస్త |
| 47 | 26 | దూటి | మాటి |
| 51 | 21 | ధారర | ధాధర |
| 54 | 7 | కర్మ | కర్ణ |
| 55 | 7 | జేసె | జేసి |
| 55 | 20 | మించి | వించి |
| 60 | 5 | సాపు | సాప్తు |
| 63 | 8 | సుతతి | సుదతి |
| 67 | 3 | న | నన |
| 68 | 18 | టురుక్మి | టిదున్మి |
| 73 | 1 | యుపాలించి | యుపాలంచించి |
| 75 | 20 | బనంత | బనంతా |
| 76 | 25 | ఔంకట | ఔంకణ |
| 78 | 21 | జేర్చి | దేర్చి |
| 81 | 24 | చిక్కొర్చి | చిక్కేర్చి |
| 82 | 1 | గాను | లేగాను |
| 83 | 12 | రపుకాశికపుగుత్తిరాశ్లకిట్లు- (పాఠభేదము) రపుకాశికుత్తికంట్లు పవడాలు | |
| 84 | 22 | నను | నును |
| 85 | 16 | ధాత్రికిని | ధాత్రికి |
| 88 | 15 | హారద | శారద |
| 92 | 5 | యూర్ధ్వములిడి | మూర్ధమణి |
| 95 | 13 | శాంతము | సాంతము |
| 98 | 13 | పీషు | షేషు |
| 106 | 22 | బాడి | నాడి |
| 108 | 8 | దత | తద |
| 109 | 12 | నత్త | వత్తల |
| 112 | 5 | లాంఛు | తాంఛు |
| 115 | 13, 14 | కపోలనీదుల— కీమ మేలుకో | కపోల సీమలలేమ మేలకో |
| ,, | 24 | మౌష్టి | మోష్టి |
| 116 | 9 | ల≡ | లల్ |
| | 24 | ప్రసంగ | ప్రశంస |

ప్రతులకు:—

శ్రీ వెలిసేటి సీతారామస్వామిచౌదరిగార

చిననడిపల్లి గ్రామం

గొల్లలపాలెం పోష్టు, చీపురుపల్లితాలూకా, విశాఖపురి జిల్లా.